"పరమదయానిధీ ! యితరపాపఫలంబు లవెన్నియేని, నా
శిరమున నిచ్చవచ్చినటు చిక్కగవ్రాసిన సైతు నోవిధీ !
అరసికులైన వారలకు హారికవిత్వముఁ జెప్పుమంచు దు
ర్భరమగువ్రాతవ్రాయకుము, వ్రాయకు, వ్రాయకు, వ్రాయబోకుమా"

శ్రీ

# తొలి పలుకు

గీర్వాణభాష బహువిధకావ్యరత్నములకు గని. అందు భర్తృహరి త్రిశతి యమూల్యరత్నము. దానినిఁ బెక్కండ్రు తెనిఁగించి యాంధ్ర భాషాయోషకంఠసీమనమ్లానకుసుమమాలగా నలంకరించిరి. అమ్మాదిరి నీతిశ్లోకము లింకను గొన్ని గ్రంథస్థములై, కొన్ని చాటువులై యానోట నానోటఁ బడి వేలకొలందిగా నున్నవి. సుమారు రెండువందలశ్లోకములను సేకరించి తెనిఁగింపు పద్ధతులనే యవలంబించి తెనిఁగించి దానికి నీతిలహరి యనుపేరు పెట్టితిని. అవల శృంగారశతకమును గూడ వ్రాయఁ దలంచి గోవర్ధనాచార్యాదులు రచించిన గాథాసప్తశతి మొదలగు గ్రంథముల లోని శృంగారరసభూయిష్ఠములగు శ్లోకముల భావములనే యవియును ఛాయామాత్రముగా గ్రహించి స్వేచ్ఛానుసారముగాఁ దెనిఁగించి దానికి శృంగారలహరి యని పేరిడితిని. పదంపడి వేదాంతసంబంధ పద్యములు వ్రాయకుండుట నాపూనికకు లోపమని తలంచి దానికి వేఱొండు గతియే లేక శ్రీమచ్ఛంకరాచార్య విరచిత వివేకచూడామణిలో నందందు నూరుశ్లోకములను గ్రహించి యాంధ్రీకరించి దానికి వైరాగ్యలహరి యనుపేరుంచితిని. వెరసి మూడుం గలిసి సుబ్బకవి సుభాషితములను నామాంతరముగల సుబ్బకవీయ మైనది. మూడవశతకము వ్రాయలేదే యను కొఱంత దీర్చుకొనుటకే యది వ్రాయఁబడినది గాని లేకున్న శ్రీశంకరవాణిం దొరయు నేర్పు నాబోఁటి యలంతికిఁ గలదనిమాత్రము కాదని బుధజనులకు విధేయుఁడనై విన్నవించుకొనుచున్నాను. మాటం గూడ నేలోపంబులు పొడగట్టిన నవి నావిగానే యెంచి నారచనయం దేలేశమైన గుణ మున్నచో గ్రహింప రసజ్ఞులగు పండితాఖండలులకు

మనవి చేసికొనుచున్నాను. గీర్వాణభాషాప్రియులకుం గూడ ప్రియంబగు నని హృద్యాంతశతకములలో మూలశ్లోకంబులను గూడఁ బొందుపఱచితి.

గ్రంథములు రచించుట యొకయెత్తు, అవి ముద్రితములై — అందులోఁ గన్నుపొడుచుకొన్నను కాగితము లేని యీ కఱవుకాలములో వెల్వడుట మఱియొకయెత్తు. తొల్లి నారచింపఁబడిన దూర్వాసరామాయణ మంకితమంది యఖండసభామధ్యంబున వేయునూటపదార్లతో సన్మానించిన వదాన్యశేఖరులు సరసాగ్రేసరులు నగు శ్రీమన్నె సత్యనారాయణమూర్తి జమీందారుగా రిందలి స్వారస్యమును గ్రహించి యీ కావ్యకన్యను జేపట్టి దీనిని వెల్వడఁ జేసిరి. పరమేశ్వరుఁడు వారికి వారి కుటుంబమునకుఁ బరిపూర్ణాయురారోగ్యైశ్వర్యంబు లొసంగి రక్షించుఁ గాత!

నరసాపురము,
8—2—1952.

బుధజనవిధేయుఁడు,
శిష్టా వేంకటసుబ్బయ్య.





కృతిభర్త

శ్రీ మన్నె సత్యనారాయణమూర్తి

జమీందారు, కొడమంచిలి.

కృతికర్త

కవిభూషణ, కవిశేఖర

శిష్ట్లా వేంకటసుబ్బయ్య.

శ్రీ

# కృతిసమర్పణము

శ్రీమన్మన్నెకులార్ణవ
సోమా! ఘనవైభవ జితసుత్రామా! ధీ
ధామా! యీ మాకృతి క
న్యామణి నేలుకొనుమా! యనంతప్రేమన్.

ఉ. ఆయతకీర్తిశాలివి, సమంచిత దానగుణైకశీలి, వ
త్యాయతకావ్యసంచయ రసామృతపానమదాళివౌట, నీ
కీయెడఁ గోరియిచ్చెద నహీనముదంబున మన్నె సత్యనా
రాయణమూర్తి! యీకృతి నిరంతరసౌఖ్యము నీకుఁ గూర్చుతన్.

ఉ. జుబ్బనచూఱగా, రసము జొబ్బిలఁగా, శతకత్రయంబుఁ బె
ల్లుబ్బున మన్నెవంశకలశోదధిపూర్ణశశాంక! వ్రాసితిన్
బ్రబ్బిన వేడ్క సత్కవులుఁ బండితులున్, రసలుబ్ధులౌనటన్
సుబ్బకవీయ మన్న కృతిశోభనగాత్రిని స్వీకరింపుమా!

చ. వలచెను నిన్నె మన్నెకులవారిధిపూర్ణశశాంక! చంపకో
త్పలములతోడఁ గూర్మిమెయిఁ దాఁపక కంఠ మలంకరించుఁ దా
వులు విడనాడదున్, బసువపుంగతిదప్పదు, వాడదెప్పుడున్
జెలువమెసంగునిట్టి కృతినీరజనేత్రిను గారవింపుమా!

ఉ. స్ఫాయదలంకృతిప్రకరభాగ్యముతో, విలసచ్చరిత్రతోఁ
దీయనిపల్కుతోఁ బొలుపు మీరిన సుబ్బకవీయ కావ్యక
న్యాయువతీకులైకమణి నాదటఁగొమ్మిదె మన్నెసత్యనా
రాయణ! ఆశ్రితావనపరాయణ! సత్యవచోవిభూషణా!

—:o:—

శ్రీ ర స్తు

# సు బ్బ క వీ య ము



శ్రీమద్రత్నగిరీంద్రకోటివిలసచ్ఛింహాసనాధిష్ఠితః
నానాభక్త జనావనాంచిత కళాపారీణతా శోభితః
తుల్యాఖ్యా సహితం చమత్కృతిపతిం శ్రీసత్యనారాయణం
పాయాత్సంతత మాయురర్థవిభవైః శ్రీసత్యనారాయణః. 1

శ్రీయువతీమణీవిమల చిత్తసరోరుహబంభరుండు, దే
వాయుతబృందవందితుఁ డుదారుఁడు మాధవుఁ డోముఁగాత! దీ
ర్ఘాయు రభీష్టభోగనిచయంబు లొసంగుచు మన్నె సత్యనా
రాయణు మత్కృతీశ్వరపురందరునిన్ సరసాంతరంగునిన్. 2

శా. హారాళంబుగ సర్వలోకవితతిన్ హేమింపఁగాఁ జేసి, యా
ధారాధేయ మహాప్రభావమున మర్త్యశ్రేణి నాడించు నా
క్షీరాంభోనిధి రాజరాజ తనయా శ్రీరంగధామేశ్వరీ
కారుణ్యామృతధార జాలుకొను మత్కావ్యాంగనాథర్తపై. 3

ఉ. సుంత కటాక్షవీక్షణము సోకిన యంతటిమాత్ర బ్రహ్మక
ల్పాంతముదాఁక నే సరసిజాసనునింతి యశంబుపేరి దే
హాంతరమున్ గవీంద్రనిచయంబునకున్ సృజియించినిల్పు, న
య్యింతి, యశోవిశాలు నొనరించుత నన్నును మత్కృతీశ్వరున్. 4

చ. రజతసమైకదంతు, ద్విజరాజధరున్, త్రిగుణచ్యుతున్, జతు
ర్భుజరమణీయుఁ, బంచకరపుష్కరమండితు, షణ్ముఖస్తుతి
వ్రజపరిభూషు, సప్తదళపావనగంధి మదోదకోజ్జ్వలున్
గజముఖుఁడైన యష్టతను గాదిలిపుత్రు భజింతు భక్తిమై. 5

కం. ప్రాచీనకవీంద్రుల క
ర్వాచీనవిచక్షణులకు, రసలుబ్ధులకున్
వాచా(ప్రౌఢిదలిర్ప స
మీచీనాంజలియొనర్తు మిక్కిలుభక్తిన్. 6

గీ. నీతిమంతులుగ నొనర్చు నీతిలహరి
హారిరసికతఁ గూర్చు శృంగారలహరి
రాగశూన్యులఁ జేయు వైరాగ్యలహరి
వెరసి సుబ్బకవీయమై వెలయునిద్ది. 7

ఉ. ఆయతమా బహూకృతి, సముంచితగౌరవ, మాదరంబు, ధీ
శ్రీయొసలారురీతిఁ గవిశేఖరుఁ డౌనను మన్నె సత్యనా
రాయణమూర్తి చేయవలె, నన్యులు చేయఁగలారె? యంతగా
నాయితమైన నాఘనత, యాసొగ, సారహి, యావహిల్లునే? 8

చ. ఒకకవి వ్రాసి పెక్కుకృతు లొక్కొకపుణ్యున కిచ్చుటయ్యెఁ దా
నొకరుఁడు పెక్కు సత్కృతుల నొందుట కల్గెను బెక్కుతావులం
దొకకవి రెండుసత్కృతుల నొక్కనికే యిడుటబ్బదెందు, మా
మక సుకృతంబుచే, నదియ, మాకిపు డబ్బెనటంచు నుబ్బెదన్. 9

సీ. రాజాధిరాజైన రాజనరేంద్రుఁడే
కృతి యొక్కటే గ్రహియింపఁ గలిగె
వేలకువేలిడ్డ వేమభూపతి కూడఁ
గృతి యొక్కటే గ్రహియింపఁ గలిగె
నిష్ణాతమతియైన కృష్ణరాయలు గూడఁ
గృతి యొక్కటే గ్రహియింపఁ గలిగె
తంజాపురము నేలు ధరణీశ్వరుఁడు గూడఁ
గృతి యొక్కటే గ్రహియింపఁ గలిగె

గీ. దొడ్డరాజ్యంబులేలిన రెడ్డిఱేండ్లు
కృతియొకటె గ్రహించిరి; రెండుకృతుల

నొక్కకవియొద్దఁ గైకొంట యొదవలేదు
పైడిపఱ్ఱుప్రభునకె యీభాగ్యమబ్బె." 10

కం. అని నేఁబలికిన విని యా
యనఘుఁడు చిరునగవున సభనమరింపుడనన్
వినిచెను, దదుదారత నే
మనవలె ? మనవలె నతఁడు శతాయుర్వృద్ధిన్. 11

కం. ఆ సుకృతాయతచిత్తుని
వాసిగ వాసిగను కృతికిఁ బ్రభువన్యునిగాఁ
జేసియు, మును వర్ణించియు
భాసురవంశంబు మరలఁ బ్రస్తావింతున్. 12

సీ. సిరి సంపద లొసంగు క్షీరసాగరకన్య
పుణ్యోరువున కేది భూషణంబు
కలుషకర్దమరాశి క్షాళనం బొనరించు
పుష్కరాపగ కేది పుట్టినిల్లు
లోకేశభూతేశ పాకశాసనులాది
క్రతుభుక్కులకు నేది రక్షణంబు
కశ్యపాత్రివసిష్ఠ కౌశికనారద
మునిసత్తముల కేది మోక్షలక్ష్మి

గీ. రత్నమంజీరితానేకరమ్యనిగమ
ఝాళఝుళఝుళీఝుళఝుళంఝుళమనోజ్ఞ
నినదనివహమ్ములకు నేది మనికిపట్టు
శ్రీమహావిష్ణుపద మద్ది చెన్నుమీఱు. 13

కం. తత్పదమున ధీశ్రీ సం
పత్పదవీపద విరాజమానులయి లసత్
సత్పథులు జనించిరి గం
గోత్పలనేత్రకెన కమ్మ లున్నతబుద్ధుల్. 14

చ. కల, వలపెక్కు-భేదము, లఖండ పరాక్రమ విక్రమక్రముల్
కలరొకకొంద రందు గుణగణ్యులు, ధన్యులు, మాన్యు, లన్యరా
ట్తిలకుల ఘోరఖడ్గ శితదీప్తులపొంకమడంచి, యిద్ధరా
తలపతులై, వదాన్యులు, నుదారులునై, రహియించి రెల్లెడన్. 15

కం. వారలలో నవ్వారిగ
నైరావతకామధేను హారామృతక
ర్పూరపటీరజ్యోత్స్నా
పారదనిభయశులు మన్నెవంశమువారల్. 16

సీ. కీర్తిలోఁ జిత్తవిస్ఫూర్తిలో హిమముతో
మచ్చరింపఁగ నేర్చు మన్నెకులము
కాంతిలో రూపవిక్రాంతిలోఁ జపలకు
వన్నెఁబెట్టఁగ నెన్ను మన్నెకులము
బుద్ధిలో వాక్యసమృద్ధిలో లోకేశు
మందగింపఁగఁజాలు మన్నెకులము
క్రమములో భూరివిక్రమములో రఘురాము
నెన్నఁజాలఁగ నేర్చు మన్నెకులము

గీ. మహిత విఖ్యాతినందిన మన్నెకులము
నందు నందఱు జనవంద్యులైనవారె
యుద్భవించి యశశ్చంద్రికోదయంబు
సలిపిరి పగలురేయను పలుకులేక. 17

కం. వెన్నెముకల, మాంసంబుల
నెన్నికమై మూఁడడుగుల నిడఁజాలినవా
రన్నన్న! దానవీరులె?
మన్నెంబుల నిచ్చు మన్నెమాన్యులకంటెన్. 18

శా. ఆ రాజత్కులమందుఁ బుట్టె, నురువిఖ్యాతప్రభావుండు, దు
ర్వారప్రాభవభూషితుండు, విలసద్భాగ్యాభిరాముండు, స

ద్ధీరాగ్రేసరుఁ డార్యసన్నుత పవిత్రీభూతచారిత్రుఁ డిం
పార న్వేంకటరాయదంపతుల కాహా! బాపినీడుర్వరన్. 19

చ. ఇరవుకొనంగ సద్గుణములెల్లను మానవజాతి లేములన్
గరమును బాపినీడగుటఁ గాదొకొ సార్థకమయ్యె నామ, మీ
శ్వరమతి బాపినీడునకు వైభవమొప్పఁగ బాపనాంబికన్
బరిణయమై గృహస్థ హితభూసురధర్మములన్ ఘటింపఁగన్. 20

ఉ. అంతటఁ గొంతకాలమున కా మిథునంబున కుద్భవించె, సు
స్వాంతుఁడు, బుద్ధిమంతుఁడు, మహామహిమాన్వితమానసుండు, దు
ర్దాంతపరాక్రమక్రముఁ డుదారుఁడు వేంకటరాయఁ డీశ్వరో
దంతనితాంతకాంతి సముదంచితచిత్తబిసప్రసూనుఁడై. 21

కం. కొండమంచిలి యమరావతి
కొడయండుం బౌరసురుల కొడయండై, యే
యొడుదుడుకు లేక వర్తిలె
నొడికమ్మున నొడలిచూపు టొడయని కడిమిన్. 22

చ. అనుపమనీతిశాలి యగునాతఁడు, పెండిలియయ్యె, నాగమాం
బను, ఘనవంశసంభవను, మాన్యచరిత్రను, మానినీలలా
మను, నతిశాంతచిత్తను, సుమానసతికిం బ్రతివచ్చు మేలివ
ర్తనను, స్ఫుటాస్యకాంతిజితతామరసప్రతిపక్షబింబనున్. 23

కం. నాగాంబను బరిణయమై
త్యాగంబులనిలయుఁడగుచు ధనధాన్యమహా
యోగంబున వేంకట్రా
యాగణ్యగుణుఁడు యశస్సమంచితుఁడయ్యెన్. 24

చ. పనులను ధీరనాగ, శుచిభాగ్యపుటెన్నిక గంగనాగ, నో
ర్పున క్షితికాంతనాగ, బహుపుణ్యసతీత్వమునం దరుంధతీ
వనరుహనేత్రనాగ, హితవాక్చయబోధల మంత్రినాగఁ బెం
పెనయఁగ నాగమాంబ నుతికెక్కె నిజాభిధ సార్థకంబుగన్. 25

సీ. అతిథిసత్కారంబు లాచరించెడుచోట
నాలమందలమేఁత లమరుచోట
పాకశాకానీక పరిసిద్ధియగుచోట
మిసిమిమీఁగడపేస్సు లెసఁగుచోట
అఖిలాప్తులును విందులారగించెడుచోట
ససుఁగు లోరెంబులు మెసవుచోట
పండితోత్తమగోష్ఠి పరిఢవిల్లెడుచోట
సంసేవకగణంబు సాకుచోట

గీ. నెల్లచోటులఁ దానయై యింటిపనుల
నెల్ల సలుపుచుఁ దనమాట కెదురు లేక
యలరు నిరతంబు ధర్మకార్యావలంబ
నయవినయ సుగుణకదంబ! నాగమాంబ! 26

గీ. మంచి "తిస్సాలబియ్య" మమందరీతి
బహుదయారసస్ఫూర్తిని భద్రపఱచి
పచ్చిబాలెంతరాండ్రకుఁ బథ్యమునకుఁ
బంచిపెట్టును నాగమ్మ భక్తిగరిమ్మ. 27

ఉ. ఆ యసమానదంపతుల కంచితధర్మపథప్రవర్తి, య
త్యాయతకీర్తి, సత్యవచనామృతవాఃపరిపూర్తి, సంతత
స్థాయదుదార ధీరగుణ సంచయభాసితమూర్తి, సత్యనా
రాయణమూర్తి, ధూతదురితార్తి, జనించెను వంశకర్తయై. 28

కం. ఏవిధిఁ బూజించెనో యే
దేవుని బంగారుపూలఁ ద్రికరణశుద్ధిన్
ధీవిభవుఁడు, సుగుణాత్మకుఁ
డావిర్భవమందె నాగమాంబికయందున్. 29

ఉ. పిల్లలుఁ బెద్దలెల్లరును బేరిమిఁ బిల్తురొ యేవధూమణిన్
బుల్లెమగారటంచుఁ గడుముద్దులుగుల్కు సమాఖ్య, నా సము

త్ఫుల్లసరోజనేత్రిను, బ్రిపూతచరిత్రిను, గంగమాంసతిఁ
వల్లభగా గ్రిహించె, గుణవల్లభుఁ డీకృతినేత ప్రీతిమై. 30

ఉ. ఆయతకీర్తి రామవసుధాధిపచందు్రిని దేవివోలె; ద్యో
నాయకురాణి చందముఁ, బినాకిసతీమణిరీతి, సత్యనా
రాయణమూర్తిపత్ని, యవురాయని మెచ్చ జనమ్ము, గంగమాం
బా యువతీలలామ, బహుపావనతాగుణధామ యొప్పెడున్. 31

చ. అతులిత శిల్పమందిరములందల టాజిమహల్, తరంగిణీ
వితతులలోన గంగ, పురవీథుల లండను, సౌరభాంచిత
క్షితిరుహజాతిలో "నయిటుక్వీను" సరస్వతి మానసంబు, స
త్సతులకు గంగమాంబ యని సంస్తుతిసల్పుదు రామె నందఱున్. 32

గీ. పార్వతీపరమేశ్వర ప్రితిభమించి
తనరుచున్నట్టి యాపుణ్యదంపతులకు
లీలమెఱయఁ గుమారునిఁ బోలువాఁడు
వినయయుతుఁడు కుమారుఁ డావిర్భవించె.

మ. కుటిలవ్యాపృతిసున్న, కోపమను పేకోశంబునన్ లేదు, దు
ర్ఘటకార్యాచరణప్రివీణత కగారం, బాస్యశీతాంశుపై
నటియించున్ జిరునవ్వువెన్నెలలు విన్నాణంబుగా నెప్డు, వేం
కటనారాయణ వంశదీపకుఁ డఖండశ్రీలఁ బెంపొందుతన్. 34

ఉ. ఆతఁడు బోళ్ళరాఘవుల యాత్మజ నుద్వహమయ్యె, సద్గుణ
వ్రాతసముద్ర, భర్తృపదపద్మనిషేవణరీక్షభద్ర, సం
పూత పతివ్రితాత్వగుణభూషణముద్ర, యజస్రమందిరా
నీతవనీపకార్చనవినిద్ర, విరాద్రిను వీరభద్రిముఁ. 35

ఉ. ఆరయ వీరభద్ర మనియంటయె కాని యొకప్పుడేనియున్
వీరవచస్సు లేదు, తన పెన్మిటిమాటను దాటఁబోవ, దే
యేరహిఁ సంచరించిన న దేమనిపల్కదు సద్గుణంబులన్
దీరిచి దిద్దిరాయనఁగఁ దేజరిలున్ సతులందు మిన్నయై. 36

గీ. అరయ వేంకటసూర్యసత్యప్రసాదు
చెలఁగి శ్రీకృష్ణుఁ డనుచిరంజీవు లిరువు
రిర్వురుకుమారితలు నింపెసక మెసఁగఁ
బుట్టి రాదంపతుల మహాపుణ్యగరిమ. 37

కం. అవ్వకుఁ దాతకు మది ము
త్తవ్వకు సమ్మదము గూర్ప నంకురితంబై
యవ్వంశము పెల్లలముచు
నివ్వటిలుంగాక! కట్టి నెచ్చెలి కరుణన్. 38

వ. వెండియు మత్కృతీశ్వరుని యభిజనంబును, గుణగణంబులను వక్కాణించెద. 39

సీ. దివ్యపస్థానదీతీర మేచోట
యేచోట బుధకోటి యెసఁగుచుండు
శివకేశవస్ఫూర్తి చెలువాఱు నేచోట
నేచోట దుర్గాంబ యేపుసూపు
బంగారుతీగలు ప్రభవించు నేచోట
నేచోట బలుతోట లింపునింపు
కేదారభూముల యాదరం బేచోట
నేచోట గోగణం బెలమిగులుకు

గీ. భవ్యరంభల కేచోటు పాలవెల్లి
పాడిపంటల కేచోటు పట్టుకొమ్మ
యట్టి కొడమంచిలి తనకుఁ బుట్టినిల్లు
గాఁగ సుఖడోలికలయందు నూఁగులాడు. 40

సీ. ఆంధ్రదూర్వాసరామాయణం బేజమీం
దారున కంకితమై రహించె
గుమ్మముపాడును కొడమంచిలియుఁ జైడి
పట్టు లర్హంబు లెవ్వానికృపకు

నిఖిలకోవిదపికానీకమ్మునకు నెవ్వఁ
డతి మనోహర వసంతాగమంబు
ఘనవనీపకబృందకామితార్థస్ఫూర్తి
కెవని దోర్దండంబు దివిజతరువు

గీ. అతఁడు మన్నె సత్కులకలశాంబురాశి
పూర్ణిమాసుధాకరమూర్తి, పుణ్యవర్తి
సరసకీర్తి, రసజ్ఞతాచక్రవర్తి
ప్రౌఢ సత్యనారాయణమూర్తి వెలయు. 41

శా. దార్జన్యంబు హుళిక్కి, కృత్రిమము సోదాకైనలే దద్దిరా!
'దర్జా' కింతయు లోపమేర్పడెడు పద్యంబోవఁ డేవేళలన్
దుర్జాతిన్ దవుదవ్వులం దనుచు సంస్తుత్యాత్ముఁడున్ స్వీయదోః
ఖర్జూనిర్జిత శత్రువిక్రమకళాకాండుం డతం డెన్నఁగన్. 42

సీ. చంపకాపరిణయ సత్కథ వినినంత
ధర్మసూక్ష్మముఁ దెల్పి తనరుసుమతి
శృంగారలహరిలోఁ బొంగారురంగారు
పద్యసారస్ఫూర్తిఁ బడయుసుమతి
వాసవదత్తలో వర్ణనీయంబైన
హాస్యపద్యము మెచ్చునట్టి సుమతి
అప్పటప్పటి సమస్యాపూరణంబుల
నింపుగా రసము గ్రహించుసుమతి

గీ. కథలు, నవలలు, నాటకాల్, కబ్బములును
పరిహాసనా, లితిహాస, పురాణచయము
లన్నియు నెఱుంగనేర్చిన యమలసుమతి
మన్నె సత్యనారాయణ మహితసుమతి. 43

చ. సిరులను, సంపదున్నతులచేఁ దులఁదూఁగుచునుండి, యెంతయో
పరువుఁ బ్రతిష్ఠయుంగలిగి, భాసిలుచుండియు, గర్వకారణం

బిరవయియుండియు౯, గరునమింతయు లేమి, తదీయవర్తనం
బొరవడిగాఁగఁజూపి, పురుషోత్తముల౯ బరమేష్ఠి దిద్దెనో? 44

ఉ. పుట్టకముందె పుట్టినవొ, పుట్టుకతోడ నెపుట్టియున్నవో
పట్టికి నుగ్గుఁ బాలను నెపంబునఁ బెట్టుటఁ బుట్టెనేమొ, క
న్పట్టినతోడఁ బండితులు, భక్తి వినమ్రిత శాంతభావముం
దొట్టి సధర్మవర్తనముతోఁ జరియించు గుణప్రకాండముల్. 45

మ. సరసంబొల్చెడు నూతులందు, జలముల్ క్షారంబులైయుంటఁ, దా
నరయంగల్గియు సత్రమున్నిలిపి, దివ్యంబైన తద్భూమిలో
నురవౌ బావినిద్రవ్వఁదీయనగు నీరూఱెంగదా! యౌర! యి
ద్ధర, నంతఃకరణానుసార మగుఁగాదా! కార్యసాఫల్యము౯. 46

ఉ. "ఈయెడనూయి, నీళ్లగది యిచ్చోడ. వీలగువంటయిం డ్లవే
యీయెడఁ బండుకొంట కనువౌ పెనుసావడులల్లవే! సుఖ
శ్రీ యిడుఁగాదె దేనికది, చెల్వగుసత్రిమి"దంచు సత్యనా
రాయణుఁగూర్చి యందు బసలందిన పాంథులు హర్షమందరే! 47

మ. అతికష్టంబున నప్పులంబడసి, యూయూవేళలందైన, ను
ద్ధతి నించించుకరాల్చునట్టిఘనుఁ డేమంతాఢ్యుఁడౌనొక్కొ? స
ద్వ్రతము౯ సల్పినఁగాని యీయఁడొక గవ్వంగూడ, దైవంబహో!
క్షితిలో వారినిమెచ్చు, మెచ్చెదను మా శ్రీసత్యనారాయణు౯. 48

చ. సుతునకు లక్షరూప్యములు శుల్కమొసంగెదమంచు రాగ, స
మ్మతిలక, సంప్రదాయమును, మాన్యత, వంశవివృద్ధియున్న యే
యితరులొ నూరువందలిడ నింబడరంగను సమ్మతించె, మ
త్కృతిపతి, గౌరవంబన నదెంతటితీపియొ సజ్జనాళికి౯. 49

సీ. గ్రహియించినాఁడు దూర్వాసరామాయణ
కావ్య కన్యామణీ సవ్యకరము
నిర్మించుకొనినాఁడు నిఖిలదిక్కులునిండ
సమధికంబగు యశస్సౌధవీధి

కట్టించియున్నాఁడు కలజనంబులకెల్ల
సౌఖ్యాలవాలమౌ సత్రశాల
ధరియించియున్నాఁడు తఱచిచూచినఁగాని
కానుపింపని దానకంకణంబు

గీ. నెన్నఁదగుభక్తి సేవించి యున్నవాఁడు
ధరణిఁ బ్రాక్పశ్చిమోత్తర దక్షిణాది
దంతరస్థపుణ్యక్షేత్ర సంతతులను
మన్నె సత్యనారాయణ మహితమూర్తి. 50

చ. తలఁపఁగ మత్కృతీశుని సుధామయసౌధముఁ జేరఁబోవుచున్
గెలసము పెంపు నివ్వటిల గేదెపెరుంగు మెఱుంగు గడ్డతోఁ
దొలఁకు పదార్థసంతతులతోఁ గడుకమ్మని యాజ్యధారతోఁ
బొలుపుగ నొక్కఁడైనఁ దినిపోవకమానఁడు ప్రత్యహంబునున్. 51

చ. పగతుఱపూర్వవైరములు, బంధువిరోధము, లక్కజంపుటా
ల్మగలవిరోధముల్, హితులమధ్యవిరోధము, లిన్నియేల, యే
తెగల విరోధమైనఁ దెగఁదెంపును నేర్పులఁదీర్పులన్, బళే
తగవరి యంచు మెచ్చవలదా! భువి మన్నెకులాబ్ధిచంద్రునిన్. 52

సీ. చిన్నిపువ్వులలోని జున్నంతయును గూర్చి
పలుకు సౌభాగ్యంబు సలుపఁబోలు
నవమల్లికలలోని నవ్యసారముఁ దీర్చి
ప్రవిమలత్వంబుఁ గూర్పంగఁబోలు
నిర్జరగురునిలో నిగ్గంతయును జేర్చి
ధీవిశేషంబు సంధింపఁబోలు
దిరిసెనపూలలోఁ బరువమంతయు నేర్చి
మృదులభావంబు నిర్మింపఁబోలు

గీ. బ్రహ్మ, కాకయేయున్న నాపల్కుతీపి
యావిమలచిత్త, మాబుద్ధి, యామృదుత్వ

సంపదయుఁ గల్గనేర్చునె పెంపుమీఱి
మన్నె సత్యనారాయణమాన్యునందు. 53

సీ. మండువేసవియెండ మాడించునెడను, ఛ
త్రింబుఁబట్టని నిరాడంబరంబు
ఎంతదూరంబైన నిట్టె కాల్నడఁ గోడ
నేగెడు కష్టసహిష్ణుతయును
ప్రాలుమాలిక లేక ప్రాభాతమున లేచి
పొలములఁ గనివచ్చు మెలకువయును
ఎంతతక్కువజనుఁ డేని రమ్మన్నచో
విచికిత్స లేకుండ వెడలుసమత

గీ. యింతనిర్గర్వచారిత్ర, మింతవినయ
మింత ఋజుమార్గవర్తనం, బింతప్రజ్ఞ
యింత బహునిరాడంబర మెందుఁగలదె
యరయ సత్యనారాయణు నందె కాని. 54

చ. హరికిఁ గరంబు మోడ్చుఁ, ద్రిపురారికి జోతఘటించు, ధాతకుం
బలుపు జోహారు, శక్తికి నమస్కృతిఁ జేయు, సమస్తదేవతా
వరులకుఁ జిన్నిపూలొసఁగు భక్తిగలిర్పఁగ భేదభావముం
బొరయఁడు మన్నెవంశకులభూషణుఁ డీకృతిభర్త యెన్నఁడున్. 55

గీ. కాశియాత్రికుఁ బోవు, మక్కాకుఁ బోవు
చూచు రామేశ్వరము, జెరూసులముఁ జూచు,
స్తూపములఁ గాంచు, జైనుల శోభఁ గాంచు
సర్వమతసమత్వ మతి సంసక్తుఁ డతఁడు. 56

సీ. నలుబదెద్దులబండి నలఖండవిలి సూర్య
నారాయణ కథకు నూరిలోన
నూరేగఁగాఁ జేసి యురుతరార్థము లిచ్చి
రామభక్తి ఘటించి ప్రబలినాఁడు

కవిశేఖరునిఁ గృతికర్త నూరేగించి
వేయార్లతో గౌరవించినాఁడు
ఐదువేల్ రూకల నర్పించి నరసపు
రకళాలయమునకుఁ బ్రబలినాఁడు

గీ. ఫలమపేక్షింప కుద్దేశకలనలేక
శుద్ధనిర్మలత్రికరణశుద్ధియుతము
గుప్తవితరణ మొనరించు కోవిదుండు
మన్నె సత్యనారాయణ మహితయశుఁడు. 57

కం. తాలూకాబోర్డుల పరి
పాలనమున నిర్వదేండ్లు ప్రాంచత్సభ్య
త్వాలంకృతుఁడై, నుతుఁడై
యేలించెను లీలఁ జాల నేలికగమిచేన్. 58

శా. జిల్లాబోర్డున సప్తవర్షము లవిచ్ఛిన్నంబుగా, సభ్యతా
వాల్లభ్యంబు వహించి మన్నెకుల భాస్వత్సింధుశుభ్రాంశుఁడ
త్యుల్లాసంబు హితాహితావళికి భేదోద్యోగమేలేక యు
ద్యల్లీలన్ ఘటియించె శాశ్వతములౌ నవ్యాని సత్కార్యముల్. 59

సీ. దుర్వ్యసనములకు దూరగుండగువాఁడు
వినుతింపఁదగు ప్రవర్తనమువాఁడు
మిత్రానుకూలత మేళగించెడువాఁడు
బుధజనవంద్య సద్బుద్ధివాఁడు
సిరిసంపదలుగల్గి గరువమందనివాఁడు
పేరాసయే లేని పెద్దవాఁడు
కలనైన నన్నృతంబుఁ దలఁపఁ బోవనివాఁడు
మెచ్చైనసలహాల నిచ్చువాఁడు

గీ. ప్రథితలోకవిజ్ఞానసంపద గలాఁడు
అన్నమాటకుఁ దిరుగులేనట్టివాఁడు

మన్నెకులదీపకుండయి మసలువాఁడు
రమ్యసుగుణుండు సత్యనారాయణుండు. 60

## ష ష్ఠ్యం త ము లు

కం. ఏతాదృగ్గుణమణి సం
ఘాతసముజ్జ్వలునకు, నయకమనీయవచో
పేతున, కస్తోకలస
చ్ఛ్రీతులితాఖండలునకు, స్థిరచిత్తునకున్. 61

కం. వితత వినయ విద్యా
చతురున, కఖిలార్థిజన విచక్షణునకు, సం
తత హర్ష స్మేరునకుఁ బ్రి
థితకీర్తిసుశోభితునకు, ధీసద్మునకున్. 62

కం. శ్రీ కవిశేఖరకృతకృతి
నైకముఖస్రిత సుకీర్త్యమృతధారాసం
సేకధవళాయమానమ
హాకమలభవాండ భాండికాస్థానునకున్. 63

కం. శ్రీ గంగమాంహృదయప
ద్మాగార నిరంతరచరదళి నాథునకున్
నాగాంబాప్రియసుతునకు
వాగీశ్వరతుల్య చతురవాగ్గేయునకున్. 64

కం. గుణమణికి, సత్యనారా
యణమూర్తికి, దానశీలి. కౌనమ్రకవీ
డ్గణశాలికి, నరమాళికి
ప్రణుతాత్యంతప్రశాంతి పాథోనిధికిన్. 65

వ. నూత్నపుర ధనకనకవస్తువాహన పుత్రపౌత్రాది సర్వాభ్యుదయపరం పరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన సుబ్బకవీయంబను గ్రంథరాజంబు నకుఁ బ్రారంభం బెట్టిదనిన: 66

# నీ తి ల హ రి

శ్లో. సానందం సదనం సుతాశ్చ సుధియః కాంతా న దుర్భాషిణీ
సన్మిత్రం సుధనం స్వయోషితిరతి శ్చాజ్ఞాపరా స్సేవకాః
ఆతిథ్యం శివపూజనం ప్రతిదినం మృష్టాన్న పానంగృహే
సాధోస్సంగముపాసతే హి సహితం ధన్యో గృహస్థాశ్రమః.

చ. పతికెదురాడనట్టిసతి, భవ్యగుణుల్ సుతు, లాత్మమానినీ
రతి, ప్రముదాఢ్యమందిరము, ప్రాజ్ఞులు సేవకు, లిష్టభోజనం
బతిథిసుపూజ, సత్సఖుఁడు, న్యాయసమార్జితవిత్త, మీశ్వరా
ర్పితమతి, సాధుగోష్ఠిగలపెద్దకుటుంబి కృతార్థుఁ డెంతయున్. 1

శ్లో. గుణవజ్జన సంసర్గా ద్యాతి స్వల్పోపిగౌరవం
పుష్పమాలానుషంగేణ సూత్రం శిరసిధార్యతే.

గీ. సద్గుణాంచితజనుని సంసర్గసరణి
యల్పునకుఁ గూడ గౌరవం బబ్బఁజేయుఁ
బుష్పమాలానుషంగంబు పొలుచుకతన
దారమునుగూడ శిరముపైఁ దాల్పఁబడదె ? 2

శ్లో. పిబంతినద్యః స్వయమేవ నాంభః
ఖాదంతి న స్వాదుఫలాని వృక్షాః
పయోధరో న క్వచిదత్తి సస్యం
పరోపకారాయ సతాం విభూతయః.

మ. విఱుగంగాచినయేని యొక్కఫలమేఁ వృక్షంబు భక్షించునే ?
వఱదల్ వాఱిన వాగు బిందువయినన్ బానంబుఁగావించునే ?
నెఱయుంబండినయేని సస్యలవముల్ జీమూత మాశించునే ?
సిరులందూఁగిన స్వార్థ మింత సుకృతిశ్రేష్ఠుండు వాంఛించునే ? 3

శ్లో. ప్రథమవయసిపీతం తోయ మల్పం స్మరంతః
శిరసి నిహితభారా నారికేళా నరాణాం

సలిలమమృతకల్పం దద్యు రాజీవితాంతం
నహికృతముపకారం సాధవో విస్మరంతి.

చ. తొలి నెలప్రాయమందిడిన తోయకణంబుల సంస్మరించి, యూ
దలపయి భూరిభారమును దాలిచి లాంగలి, చచ్చుదాఁక, స
ల్లలితసుధోపమానసలిలమ్ము లొసంగు మనుష్యజాతికిన్
సలిపినసత్కృతమ్ములను సాధుజనమ్ములు విస్మరింతురే ! 4

శ్లో. కవిఃకరోతి పద్యాని లాలయం త్యుత్తమోజనః
తరుః ప్రసూతే పుష్పాణి మరుద్వహతి సౌరభమ్.

కం. కవి వ్రాసినకావ్యంబులఁ
బ్రవిమలుఁ డుత్తముఁడు దాల్చి వ్యాప్తముఁ జేయున్
అవనిజ మీనినసుమములఁ
బవమానుఁడు దాల్చి తావిఁ బ్రాకఁగఁ జేయున్. 5

శ్లో. గిరౌకలాపీ గగనేపయోదో లక్షాంతరేర్కశ్చ జలేషుపద్మం
ఇందుర్ద్విలక్షే కుముదస్యబంధుర్యోయస్యహృద్యో నహితస్యదూరమ్.

ఉ. మిత్రుఁడుమింటిపైఁ బొడమ మేదినిలో, నళినమ్ము విచ్చు, న
య్యత్రిజుఁ డెచ్చటో యుదయమందినఁ గల్వ రహించు నిచ్చటన్
గోత్రమునందునిల్చి శిఖి కూరిమినాడుఁ బయోదుఁ జూచుచున్
మైత్రికి దవ్వుదాపు లనుమాట ఘటిల్లునె పోల్చిచూచినన్. 6

శ్లో. అజాయుద్ధే ఋషిశ్రాద్ధే ప్రభాతే మేఘడంబరే
దంపత్యోఃకలహేచైవ బహ్వారంభో లఘుక్రియా.

చ. తెలతెలవాఱువేళఁ బొడతెంచు వలాహకడంబరంబు, ని
మ్మల ఋషిసార్వభౌమునకుఁ బొల్పగు శ్రాద్ధపుఁగర్మ, మేకపో
తులకలహంబు, నాల్మగల తోరపుఁగయ్యములందు నల్కయున్
తొలితొలి ఘోరతాపటిమఁ దోఁచి లఘుక్రియదంబులౌఁ దుదిన్. 7

శ్లో. ఉదయతియదిభానుః పశ్చిమే దిగ్విభాగే
వికసతి యదిపద్మం పర్వతానాం శిఖాగ్రే

ప్రచలతి యదిమేరుః శీతతాంయాతి వహ్నిః
నచలతిఖలువాక్యం సజ్జనానాం కదాచిత్.

చ. జలజహితుండు పశ్చిమదిశన్ ప్రభవించునుగాక! మేరువుర్వ
జలనమునందుఁగాక! జలజమ్ములు ఊాలజశింమఁగాక! యిం
గలమును జల్లనైయెసఁగుఁగాక! లయమ్మగుఁగాక సర్వముర్వ
బలికినపల్కు లేదనుచుఁ బల్కరు లోకపూజ్యులైన సజ్జనుల్.    8

శ్లో. దానం ప్రియవాక్సహితం జ్ఞానమగర్వం క్షమాన్వితం శౌర్యం
విత్తం త్యాగనియుక్తం దుర్లభ మేతచ్చతుష్టయమ్.

గీ. ప్రియహితవచోన్వితంబైన వితరణంబు
గరువమెడలినజ్ఞానంబు, క్షాంతియుక్త
మైనశౌర్యంబు, త్యాగాఢ్యమైనధనము
అధికదుర్లభ మీనాల్గు నవనియందు.    9

శ్లో. గోభి ర్విప్రైశ్చ వేదైశ్చ సతీభిః సత్యవాదిభిః
అలుబ్ధై ర్దానశీలైశ్చ సప్తభి ర్ధార్యతే మహీ.

చ. కులగిరిసప్తకం బఖిలకుంభినిఁ దాల్చినభంగి నియ్యిలా
తలమును గోగణంబు, వసుధాసురచంద్రులు, వేదసంతతుల్,
కలితమహాపతివ్రతలుఁ గామితదూరలు, నిత్యసత్యసం
ధులు, బహుదానశీలురును, నూల్కొని తాల్చిరిగాక క్రింగదే? 10

శ్లో. సత్యంమాతా పితాజ్ఞానం ధర్మోభ్రాతా దయాసఖా
శాంతిఃపత్నీ క్షమాపుత్ర షడేతేమమ బాంధవాః.

ఉ. సత్యమెకన్నతల్లిసుమి, జ్ఞానమెతండ్రి, నితాంతధర్మసాం
గత్యమెతోడఁబుట్టు, క్షమగాదిలిపుత్రుఁడు, భూరిశాంతిదాం
పత్యపుశోభ, సత్కరుణపాయనిమిత్రుఁడు, వీరలెల్లసా
తత్త్వముగల్గుబంధువులు, తక్కినబంధులు నామమాత్రులే!    11

శ్లో. శైలేశైలే న మానిక్యం మౌక్తికం న గజేగజే
సాధవో నహిసర్వత్ర చందనం న వనేవనే.

చ. ప్రతిధరణీధరమ్మునన విభాస్వరరత్నము లుప్పతిల్లునే?
ప్రతిమదకుంభికుంభమునఁ బాటిలనేర్చునె మౌక్తికచ్ఛటల్?
ప్రతివనవాటికాంతరతలమ్మునఁ బుట్టునె చందనాగముల్?
జతపడనేర్తురే పరమసాధుసమూహము లెల్లతావులన్? 12

శ్లో. నాపేక్షా నచదాక్షిణ్యం నప్రీతి ర్నచసంగమః
తథాపి హర తేతాపం లోకానా మున్నతోఘనః.

గీ. లే దపేక్ష, దాక్షిణ్యంబు లేదుసుమ్ము
ప్రీతి లేదు, చుట్టఱికంబు పెంపులేదు
'అసలె' స్నేహంబులే దట్టిలయ్యు ఘనులు
లోకతాపోపశమనలోలుపులు గారె? 13

శ్లో. ముఖంప్రసన్నం విమలాచదృష్టిః కథానురాగో మధురాచవాణీ
స్నేహాధిక స్సంభ్రమదర్శనంచ సదానురక్తస్య జనస్య లక్షణమ్.

చ. వదనము సుప్రసన్నమయి భాసిలుచుండుట, నిర్మలంబులై
పొదలుట వీక్షణద్యుతులు పుష్కలమైత్రియుఁ బ్రీతిభావమున్
గదిరినదర్శనంబు, బహుగాథలరక్తియుఁ బల్కుతీపిసం
పదయు, సదానురక్తులగువారల కుండెడు లక్షణావళుల్. 14

శ్లో. మానుష్యం వరవంశజన్మవిభవః దీర్ఘాయు రారోగ్యతా
సన్మిత్రం సుసుతః సతీప్రియతమా భక్తిశ్చనారాయణే
విద్వత్వం సుజనత్వ మింద్రియజయః సత్పాత్రదానేరతిః
తే పుణ్యేనవినా త్రయోదశగుణాః సంసారిణాందుర్లభాః.

చ. విభవము, సత్కులోదయము, విద్య, సుపుత్రు, డరోగ, మిందిరా
విభుపదభక్తి, సజ్జనతపెంపు, దమమ్మును, బాత్రదానమం
దభిరతి, కూర్మిచేడియ, చిరాయువు, నృత్వము, సత్సఖుండు దు
ర్లభములుగావె యీగుణకలాపము లెన్న గృహస్థకోటికిన్. 15

శ్లో. కఠినోపిజనో యాతి సాధుసంగేన మార్దవమ్
సుధాకరకరాసంగాత్ ద్రవంత్యే న్దైవోపలాః.

చ. ఉరుకఠినాత్ములై మిగులనుద్ధతులౌ నరులేని సాధులౌ
పురుషుల సంగమాప్తిమెయిఁ బూనుదు రెంతయు మార్దవంబిలన్
కరమును జంద్రదీధితిని కాయముసోకినయంతమాత్రనే
కరఁగి స్రవింపఁజొచ్చెడునుగాదె శశాంకశిలాసమూహముల్. 16

శ్లో. ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రౌషధసంగమౌ
దానమానావమానాశ్చ నవ గోప్యా మనీషిభిః.

గీ. దాన, మానా, వమానముల్ ద్రవిణమాన
మాయువును, గృహచ్ఛిద్రంబు, నౌషధంబు
సంగమంబును, మంత్రంబు, సాధుజనులు
గుప్తముచరింతు రింతయు గుట్టువిడక. 17

శ్లో. జీర్ణమన్నం ప్రశంసీయాత్ భార్యాంచ గతయౌవనాం
రణాత్ప్రత్యాగతం శూరం సస్యంచ గృహమాగతమ్.

చ. అఱగినవెన్క నన్నమును, యౌవనమేగినవెన్క దారనున్
దురమగువెన్కఁగ్రమ్మఱిన దోర్బలధుర్యుని, నూర్పుడౌ ననం
తరము కరమ్ము భద్రముగధామముఁ జేరిన పంటసంపదన్
బరువడి మెచ్చుకోవలయుఁ బండితులైన జనప్రకాండముల్. 18

శ్లో. దైవే తీర్థే ద్విజే మంత్రే దైవజ్ఞే భేషజే గురౌ
యాదృశీభావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ.

ఉ. దేవతలందు, మందునను, దీర్థమునందును, మంత్రమందు, భూ
దేవులయందు, నేటిగుఱుదేవులయందును, జోసియం దహో
యేవిధమైనయట్టి గురి యేర్పడు నట్టిద సిద్ధిచొప్పడున్
గావున మీఁదిసప్తకమునన్ గడులక్ష్యము నుంచఁగావలెన్. 19

శ్లో. మిత్రంస్వచ్ఛతయా రిపుంనయవిధైః లుబ్ధంధనై రీశ్వరం
కార్యేణ ద్విజమాదరేణ యువతింప్రేమాదిభి ర్బాంధవాన్
అత్యుగ్రస్తుతిభిర్గురుం ప్రణతిభిర్మూర్ఖం కథాభిర్బుధం
విద్యాభిఃరసికం రసేనసకలం శీలేన కుర్యాద్వశమ్.

చ. అరినినయమ్ముచేత, వసుధాధిపుఁగార్యముచేత, విప్రినా
దరవిధిచేత, మూర్ఖునిఁగథాతతిచే, స్వజనుంబొగడ్తచే,
గురునతిచేఁ బ్రియాంగననుగూరిమిచే రసికుల్ రసంబుచే
సరసులు లోఁగొనందగును సర్వము శీలమహత్వసంపదల్. 20

శ్లో. వేదావిభిన్నా స్మృతయోవిభిన్నా
స్తథా మునీనాంమతయో విభిన్నాః
ధర్మస్యతత్వం నిహితంగుహాయాం
మహాజనో యేన గత స్స పంథాః.

కం. శ్రుతు లవి యొకమార్గంబగు
స్మృతు లవి వేఱొక్కమార్గ మింకొకటియగున్
యతిమతగతిఁ గన ధర్మం
బతిసూక్ష్మము బుధులకోరివ లనుసార్యంబుల్. 21

శ్లో. భద్రింకృతం కృతంమౌనం కోకిలైర్జలదాగమే
దర్దురా యత్రవక్తార స్తత్ర మౌనంహి శోభనమ్.

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల కో యని కూసికూసి, సం
తస మనువార్ధివీచికల ధారుణిఁ దేలిచి నానకారునం
దెసఁగుచుఁ బల్కకుండుట బలేపని! మౌనము మేలుగాదె? క
ర్కసముగ మాటికిన్ బెకబెకల్ గల కప్పలు వక్తలౌ నెడన్. 22

శ్లో. ఋణశేషం శత్రుశేషం అగ్నిశేషం తథైవచ
పునఃపునశ్చవర్ధంతే తస్మాచ్ఛేషం నకారయేత్.

చ. ఒకరిపుఁ డేకదా యనుచు నుంచినఁ గోర్కొని తీయుఁ బ్రాణముల్
ఒక పదిరూకలప్పెయని యుంచినఁ బెంపయిముంచు మానవున్
ఒక నెరసేకదా యనుచునుంచిన రాఁజుచుఁగాల్చుఁ లోకముల్
పెకలచకున్నఁ గీడొసఁగు వేగమె శత్రుఋణాగ్నిశేషముల్. 23

శ్లో. ఏకైకాగా స్త్రయస్సింహాః పంచవ్యాఘ్రాః పరిసూతిభిః
అధర్మోనష్టసంతానో ధర్మస్సంతానవర్ధనః.

ఉ. ధేనువులేఁగఁ గొండె యొక తేపకుఁ బెట్టిన నవ్వి మందలో
నీనుచునుండుఁ బెద్దపులి యెయ్యెడఁగూనల నైదు, మూడుపం
చానననీనుచుండు నటులయ్యును గాంతుమె యెందు, వీనిసం
తానవివృద్ధిఁ జూడఁగ నధర్ములసంతతి వృద్ధిపొందునే? 24

శ్లో. నమంతి ఫలినో వృక్షాః నమంతి గుణినో జనాః
శుష్కకాష్ఠం న మూర్ఖశ్చ భిద్యతే నచ నమ్యతే.

గీ. విఱుగఁగాచినతరువును, వివిధసుగుణ
పటలిచేనొప్పు జనులును, వంగియుంద్రు
మూర్ఖుఁడును నెండుకట్టెయు మొండికెత్తి
వంగరును, మఱిభేదింపఁబడరుగాదె? 25

శ్లో. కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకమ్
మౌనేన కలహో నాస్తి నాస్తి జాగరతో భయమ్.

గీ. కృషియొనర్పఁ దొలంగు దుర్భిక్షభయము
జపము పాతకభయమును సంహరించుఁ
గలహమేరాదు మౌనంబుగలిగియున్న
జాగరమువల్ల భయమెల్ల సమసిపోవు. 26

శ్లో. గుణీ గుణం వేత్తి న వేత్తి నిర్గుణో
బలీ బలం వేత్తి న వేత్తి నిర్బలః
పికో వసంతస్యగుణాన్ న వాయసః
కరీచ సింహస్యబలం న మూషకః.

చ. తెలియు గుణాఢ్యుసద్గుణము ధీనిధి, నిర్గుణుఁ డేమెఱుంగు, న
బ్బలిబలముల్ గ్రహించు బలవంతుఁడు దుర్బలుఁ డేమెఱుంగుఁ ద
త్కలభ మెఱుంగుఁగాని మృగకాంతుబలంబు నెఱుంగ నెల్క, కో
వెల యెఱుఁగంగ నేర్చు సురభిప్రథఁ గాక మెఱుంగ నేర్చునే? 27

శ్లో. గుణవంతం సమాసాద్య నిర్గుణోపి గుణీభవేత్
మేరుకందరమాశ్రిత్య కాకోపి కనకాయతే.

గీ. భూరిగుణవంతుఁ డగువానిఁ బొందెనేని
నిర్గుణుఁడుగూడ సుగుణుఁ డై నెగడుచుండుఁ
గనకగిరి నాశ్రయించిన కాకిగూడఁ
గ్రాలుచుండునుగాదె బంగారమగుచు. 28

శ్లో. యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతాం
అపంథానంతుగచ్ఛంతం సోదరోపి విముంచతి.

ఉ. న్యాయముదప్పకుండిన జనంబులకున్ మృగజాతులేనియున్
సాయమొనర్చుఁ బోవిడుచుఁ జయ్యన సోదరునైనఁగూడ న
న్యాయసనేతుఁ, దోడుపడవా ! పశుసంచయమెల్ల రామభూ
నాయకుఁజేరె; యన్నయయినన్ దశకంఠువిడండె తమ్ముఁడున్. 29

శ్లో. షడ్దోషాఃపురుషేణేహ హాతవ్యా భూతిమిచ్ఛతా
నిద్రాతంద్రా భయంక్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా.

గీ. దీర్ఘసూత్రత, చిరము నిద్రించుచుంట
అలసభావంబుఁ గ్రోధంబుగలిగియుంట
భయముఁ, దంద్రియు, నీయాఱు వ్యసనములను
కోరఁగారాదు వృద్ధికాఁగోరువారు. 30

శ్లో. దుర్జనఃప్రథమంపూజ్య స్సజ్జన స్తదనంతరం
పదప్రక్షాళనంపూర్వం ముఖప్రక్షాళనంపరమ్.

చ. తొలుతనెపూజసేయవలె దుర్జనుఁడైతగువాని, నవ్వలన్
సలుపఁగవచ్చుఁ బూజనము సత్పురుషుండయియొప్పువానికిన్
తలఁపఁగఁ దొట్టతొల్తనె పదమ్ములుక్షాళనచేసి, దానిక
వ్వలఁగద మోమునుం గడుగఁ బాల్పడఁగావలె నెవ్వఁడేనియున్. 31

శ్లో. గుణినాం నిర్గుణానాంచ దృశ్యతేమహదంతరం
హారః కంఠగతః స్త్రీణాం నూపురాణిచ పాదయోః.

గీ. గుణముగలవానియందు నిర్గుణులయందు
నమరియుండదె కొండంతయంతరంబు

హారములు, నూపురంబులు, నబ్జముఖుల
కంఠపదసీమలనునిల్చి కాంతులుఁగాదె ? 32

శ్లో. పరోపకారాయ ఫలంతివృక్షాః
పరోపకారాయ దుహంతిగావః
పరోపకారాయ వహంతినద్యః
పరోపకారార్థ మిదంశరీరమ్.

గీ. తరులు ఫలకోటినిచ్చుట పరులకొఱకె !
పాలనిచ్చుట ధేనువుల్ పరులకొఱకె !
స్వాదుజలమిచ్చు లేఱులు పరులకొఱకె !
పరుల కుపకరించుకొఱకె నరునిభవము. 33

శ్లో. అనుకురుతఃఖల సుజనా వగ్రిమపాశ్చాత్యభాగయోః సూచ్యాః
విదధాతి రంధ్రమేకో గుణవా నన్యస్తు పిదధాతి.

చ. ఖలుఁడును, సజ్జనుండు నెసకమ్మున సూచికయగ్రిమాంతిమ
స్థలములఁ బోలియుండుదురు తచ్చరితంబులచంద మిట్లగుఁ:—
ఖలుఁడొనరించు రంధ్రమును; గ్రిక్కున సజ్జనుఁ డల్లరంధ్రముఁ
దలకొని కప్పివైచు; సముదారులవర్తన లిట్టివేకదా ! 34

శ్లో. ఘృష్టం ఘృష్టం పునరపిపున శ్చందనం చారుగంధం
ఛిన్నంఛిన్నం పునరపిపునః స్వాదుచైవేక్షుదండం
దగ్ధందగ్ధం పునరపిపునః కాంచనంకాంతవర్ణం
నప్రాణాంతే ప్రకృతివికృతి ర్జాయతేచోత్తమానామ్.

సీ. అఱుగఁదీయుకొలంది పొరిఁబొరి సౌగంధ్య
బృందంబు నీనదే చందనంబు
పిడుచుచుండుకొలంది కడుఁ దీయనిరసంబుఁ
జిప్పిల్లఁజేయదే చెఱకుఁ గోల
పుటముఁబెట్టుకొలంది పొలుపారి వన్నెకోఁ
గాంతులనీనదే కాంచనంబు

సానఁబెట్టుకొలంది సంచునించుచుఁ గాంతి
మత్త్వంబుఁగాంచదే మానికంబు

గీ. ఆచిఱంపానఁబెట్టి యట్టాకలిడుచు
నగ్ని వేల్చినఁ బ్రాణాంతమైనఁగూడ
భవ్యజనముల ప్రకృతిసౌభాగ్యమునకు
వికృతి యొక్కింతయును సంభవింపఁబోదు. 35

శ్లో. మూలంభుజంగైః శిఖరంవిహంగైఃశాఖాఃప్లవంగైఃకుసుమానిభృంగైః
ఆశ్చర్య మేతత్ఖలు చందనస్య పరోపకారాయ సతాం విభూతిః.

చ. అనిశము మూలమందుభుజగావళు, లగ్రమునందుబతంగముల్
ఘనవిటపంబులందుఁ బ్లవగంబులు, సూనములందుభృంగముల్
పెనఁగొనియుండి తామనుభవించును జందనవృక్షసంపదల్
కనుఁగొన సజ్జనోత్తములకల్మి పరార్థముగాదె యెయ్యెడన్. 36

శ్లో. అసజ్జన స్సజ్జనసంగాత్కరోతిదుస్సాధ్య మతీవసాధ్యం
పుష్పాశ్రయా చ్ఛంభుజటాధిరూఢా పిపీలికా చుంబతిచంద్రబింబమ్.

ఉ. ఎంతయసాధ్యమైనపనినేని సుసాధ్యమొనర్చు నల్పుఁ డ
త్యంతము సాధుసంగబృహదాశ్రయుఁడై విరినాశ్రయించుటన్
గంతువిరోధిశీర్షమును గ్రన్నన నెక్కఁగనేర్చి, యామినీ
కాంతుని బింబమందు నొడికమ్ముగఁ బ్రాఁకదె చీమ ధీరతన్. 37

శ్లో. గంగాపాపం శశీతాపం దైన్యంకల్పతరు స్తథా
పాపం తాపంచ దైన్యంచ హన్తి సంతో మహాశయాః.

గీ. గంగపాపంబుఁ దాపంబుఁ గలువవిందు
దైన్యమును గల్పవృక్షంబు తలఁగఁజేయుఁ
దలఁగఁజేతురు ధీరులౌ ధన్యమతులు
పాపమును, దాపమును, దైన్యభరము నొకట. 38

చ. తనునఱుకంగ గొడ్డలి నుదగ్రత నంసతలిన్ ఘటించి, యిం
పెనయఁగవచ్చు లుబ్ధకున కేనియు నీడనొసంగి యాదరం

బొనరుచుఁగాదె భూమిరుహ, మూర్జితవృత్తి గృహస్థుఁడైనవాఁ
డనుపమశాస్త్రఖండయిన నర్థికి నాశ్రయమీయఁగావలెన్ 39

గీ. చేయునేకాని యింతేని చెప్పఁబోఁడు
చెప్పునేకాని సుంతయుఁ జేయఁబోఁడు
అంతరం బింతమాత్రింబ యగునుగాదె
శ్వాంతలమ్మున సుజనదుర్జనుల కెందు. 40

ఉ. రేగడిభూములందుఁబడి రెక్కనుఁ దియ్యనిదౌచువాన నీ
రాగతమై తదీయమగు నంబువె యూషరభూమి నుప్పనై
చాగుచునుండు; నబ్బునెడ సజ్జనమైత్రి గుణంబెకల్గు, నెం
తే గరిమంపుసద్గుణము లేర్పడు దుర్జనమైత్రి యబ్బినన్. 41

మ. బలవంతుండగువాఁడు పైకొనుచుఁ గోపస్ఫూర్తిస్సై రాగ, నే
ల్కలుగున్ వంగియణంగువాని, కెదు రేగన్ జేటుచేకూఱు, నై
వలినీ శ్రేష్ఠము పొంగ, వంగి లతికల్ వర్ధిల్లవే ? నిక్కచున్
నిలువంజూచెడుమ్రాకు లాకులములై నిర్మూలతం జెందవే ? 42

చ. పెలుచదరిద్రుఁడైనను, వివేకి సభాపరిపూజితుండగున్
కలిమిఁజెలంగువాఁడయినఁ గాఁడు సుపూజ్యుఁడు జ్ఞానికానిచో
తెలివివహించునేత్రములు తేజరిలున్ సహజమ్మలైకడున్
తెలివిడిలేనిహస్తములు తేజువహించునె సొమ్ములుండియున్. 43

గీ. యోగ్యులందెరహించు, నయోగ్యులందు
నామరూపంబులేక, దానమునశించు
వానచిన్కు ముత్తెపుఁజిప్పలోనఁ బడిన
నగును ముక్తిక, మిసుకలో నంతరించు. 44

శ్లో. పరవాదేదశవదనః పరరంధ్రనిరీక్షణే సహస్రాక్షః
సద్వృత్తవిత్తహరణే బాహుసహస్రార్జునో భవతి.

చ. పరజనరాజితోడుత వివాదమువాటిలుచో దశాస్యుఁడై
పరజనరంధ్రముల్ వెదకుపట్టులయందు సహస్రనేత్రుఁడై

పర ధన వృత్త సంగ్రహణపాటవమందు సహస్రబాహుఁడై
పరఁగెడువాఁడు దుర్జనుఁడు, ప్రాజ్ఞులు సేరరు వానిపొంతకున్. 45

శ్లో. ముఖం పద్మదళాకారం వచశ్చందనశీతలం
హృత్కర్తరీసమం చాతివినయం ధూర్తలక్షణమ్.

గీ. పద్మదళసమాకారంబు వదనతలము
చందనసమశీతలము వాక్చయము, మనసు
కర్తరిసమ, మతివినయవర్తనమ్ము
ధూర్తుఁ డీలక్షణంబులఁ దోఁచుచుండు. 46

శ్లో. దుర్జనస్యవిశిష్టత్వం పరోపద్రవకారణం
శార్దూలస్యోపవాసస్య పారణం పశుమారణమ్.

గీ. దుర్జనుఁడు పైకి శిష్టుఁడై తోఁచుటెల్ల
నితరుల కుపద్రవం బాచరించుకొఱకె
యుపవసించి పారణమున కొఱగుటెల్ల
ద్వీపి పశుమారణకు విజృంభించుకొఱకె. 47

శ్లో. సర్పఃక్రూరః ఖలః క్రూరః సర్పాత్ క్రూరతరః ఖలః
మంత్రౌషధవశ్య స్సర్పః ఖలః కేన నివార్యతే?.

చ. ఖలుఁడును బన్నగంబును జగంబునఁ గ్రూరులు, తద్వయంబునం
దల భుజగంబుకంటెను ఖలాత్ముఁడె మిక్కిలి క్రూరుఁ డౌషధం
బులు బలుమంత్రముల్ గలవు, భోగివిషంబుడిగింప, లేవు త
త్ఖలుఁ డొనరించు కాటున కొకానొకమందును, మంత్రతంత్రముల్. 48

శ్లో. ఖలఃకరోతి దుర్వృత్తం నూనంఫలతి సాధుషు
దశాననో హరేత్సీతాం బంధనంస్యా న్మహోదధేః.

చ. ఖలుఁడగువాఁడు నింద్యమగుకర్మములం బొనరించుచుండఁ ద
త్ఫల, మకలంకవర్తనను బాటిలు సాధులపైఁ బడుంగదా!
చెలఁగి సురారియైన దశశీర్షుఁడు సీతను మ్రుచ్చిలింపఁగాఁ
గలిగెనుగాదె బంధన మకల్మషుఁడైనసముద్రునేతకున్. 49

శ్లో. పరోక్షే కార్యహంతారం ప్రత్యక్షే ప్రియవాదినం
వర్జయేత్తాదృశంమిత్రం విషకుంభపయోముఖమ్.

గీ. కార్యములు పరోక్షమున భగ్నంబుఁజేసి
యెట్టయెదుటను బ్రియవాక్కులే వచించి
దంభమునఁ బయోముఖవిషకుంభమైన
చెలిమికాని నాక్షణమె త్యజింపవలయు. 50

శ్లో. ప్రాక్పాదయోఃపతతి ఖాదతి పృష్ఠమాంసం కర్ణేకలం కిమపిరౌతి శనైర్విచిత్రం । ఛిద్రంనిరూప్య సహసా ప్రవిశత్యశంకః సర్వం ఖలస్య చరితం మశకఃకరోతి.

చ. తొలుతనుగాళ్ళవ్రాలి, పరిపోగతినాపయి మేనిమాంసమున్
గెలికి భుజించి, కర్ణతలి గీతము మెల్లఁగనాలపించుచున్
బలువిడి సందుచూచుకొని, వైళ, మశంకను లోనఁదూఱుచున్
ఖలుఁ డలదోమచందమునఁ గాఱియవెట్టు జగమ్ము నెంతయున్. 51

శ్లో. సమాశ్రయబలాదేవ గరుడం యాంతమధ్వని
పినాకపాణిపాణిస్థః కుశలం పృష్టవా నహిః.

గీ. భవునికరమునఁ వ్రేలాడు పాముపిల్ల
దారివెంబడిఁజను గరుత్మంతుఁజీరి
క్షేమమా ! నీకటంచుఁ బ్రశ్నించునంట
ఆశ్రయబలంబుచేఁగాదె యట్టిపొగరు ? 52

శ్లో. కాకైస్సహప్రవృద్ధస్య కోకిలస్య కలాగిరః
ఖలసంగేపి నైష్ఠుర్యం కల్యాణప్రకృతేః కుతః.

ఉ. కాకముచేతఁ బెంపకముఁగాంచియు నెంతయు దీర్ఘకాల, మా
కోకిల కాకలీధ్వనులఁ గోయని కూయునెకాని, యార్చునే
కాకివిధానఁ గర్కశముగాఁ దలపోయ, నిసర్గమంగళుం
డౌ కుశలుండు పొందఁడుగదా ! ఖలుఁగూడియు నిష్ఠురత్వమున్. 53

శ్లో. దివ్యం చూతఫలం ప్రాప్య నగర్వం యాతి కోకిలః
పీత్వా కర్దమపానీయం భేకో బెకబెకాయతే.

గీ. పక్వమాకందఫలమును బడయఁగనియు
గరువమును జెంద దింతయుఁ బరభృతంబు
బురదనీటిలోఁ గడుపాఱఁబూని త్రాగి
యప్పసముఁగప్ప బెకబెకలాడుచుండు. 54

ఉ. స్త్రీలకు మానసమ్మునన, సరీసృపరాజికిఁ గోరలందునన్
దేలున కొక్కకొండెమున, నిత్యముఁ జోరునకుం గరంబునన్
నాలుకఁ గొండెగానికి, ననంగనిపీడితుఁడైనవానికిన్
గాలుచునుండుఁగన్గవను, గాఢహలాహలమాలికావళుల్. 55

మ. ఘనవంశోద్భవుఁడైనను గుణము దగ్ధంబైనచోఁ జెంతకై
నను రానీయరు, హీనవంశ్యుఁడయినంగానీ, గుణంబున్నచో
మును గైసేతురు తావిలేనిదగు తత్పుంజేక్షుపుష్పంబు, మా
రొకనరున్ గన్నెరుపూవు మానరును మూరొక్కఁ దావిసేకూరుటన్.

చ. చెడుగులతోడ స్నేహమును జేయుట తప్పనిచో, నొకానొక
ప్పుడు, కడులెస్సగా సలుపఁబోలదు, కొంచెము పూనఁగావలెన్
విడియము వేసికోనయిన వేళలఁ గొంచెముమాత్రిసున్న మే
ర్పడ నిడఁగావలెన్గద ! రవంతయు హెచ్చిన పొక్కకుండునే ? 57

కం. ధీమునితోఁ జేరిచినను
గూరాత్మకుఁ డెందుఁ గారుకూఁతలె కూయున్
ఏ రాటంబునఁ బెట్టిన
నారాటపుఁగదురు బరబరాడకయున్నే ? 58

చ. అనయము దుష్టమైత్రిమెయి నాయముమించి, వ్యయంబుఁ జేయువాఁ
డును, బ్రభునాజ్ఞఁ దాఁటునతఁడున్ సభలో నెదిరించువాఁడు, మి
త్రునిహితబోధమున్ వినక క్రోధముఁబూనెడువాఁడు, భార్యమా
టను విని పోరువాఁడు నకటా ! యసురాధము లౌదు రేకదా ! 59

ఉ. ప్రాకటరీతి దుర్జనుని బంగరుపీఠమునందునిల్పఁ జీ
కాకుఘటిల్ల సాజముగఁ గారుల్ప్రేలు, వచియింపఁడింపుగన్
గాకినిఁబట్టి తెచ్చి యొకకాంచనపంజరమందుఁ బెట్టినన్
వాకొనుఁ గావుకావుమని, పల్కనెకుల్కుచుఁ జిల్కపల్కులన్. 60

శ్లో. అనభ్యాసేవిషం శాస్త్రం అజీర్ణే భోజనంవిషం
దరిద్రస్యవిషం గోష్ఠీ వృద్ధస్య తరుణీవిషమ్.

బ. ముదుసలివానికిన్ విషము ముద్దులగుమ్మ, యజీర్ణబాధచేఁ
బొదలెడువానికిన్ విషము భోజన, మగ్గలమైన లేవడిం
గదిరినవానికిన్ విషము క్రమతరమ్మగుగోష్ఠి, యభ్యసం
బొదవనివానికిన్ విషము యోగ్యతరమ్మగుశాస్త్ర మెన్నఁగన్. 61

శ్లో. మాతృహీనశిశుజీవనం వృథా భర్తృహీనవయౌవనం వృథా
శాంతిహీనతపసఃక్రియా వృథా తింత్రిణీరసవిహీనభోజనమ్.

ఉ. మాతృవిహీనడింభకుసిమందల, భర్తృవిహీనయౌవనం
బాతత శాంతిలేనితప, మంచితమై తగు తింత్రిణీరసో
పేతముగాని భోజనముఁ బేదఱికమ్మును బాపలేని వి
ఖ్యాతధనాఢ్యునాశ్రయము వ్యర్థము లేకద! యెల్లభంగులన్. 62

శ్లో. వివాదశీలాం స్వయమర్థచోరిణీం
పరానుకూలాం పరిహాసభాషిణీం
అగ్రాశినీ మన్యగృహప్రవేశినీం
త్యజంతిభార్యాం దశపుత్రమాతరమ్.

చ. పరపురుషానురక్తి, నిజభర్తనుమున్న భుజించుసక్తియున్
బొరుగుగృహాలఁ గాలమునుబుచ్చుప్రసక్తి, వివాదశీలమున్
బొరిఁ బరిహాసగోష్ఠి, ధనమున్ హరియించెడుబుద్ధిగల్గ, స
త్వరమె త్యజింపఁగావలయు, దారను బిల్లలతల్లినేనియున్. 63

శ్లో. అతిథి ర్బాలకశ్చైవ స్త్రీజనో నృపతిస్తథా
ఏ తే విత్తంనజానంతి జామాతాచైవపంచమః.

గీ, అల్లుఁడగువాఁడు, లేఁజిగురాకుఁబోఁడి,
పార్థివుఁడు, యాచకుండును, బాలకుండు
పీర లేవురుఁ దెలిసికో లేరు గాదె
యల గృహస్థుని కలిమిలేములయవస్థ. 64

శ్లో. గీతే వాద్యే తథాన్నృత్తే సంగ్రామే రిపుసంకటే
ఆహారే వ్యవహారేచ త్యక్త్వలజ్జ స్సుఖీభవేత్.

చ, కడిచెడువేళ, గీతమునకుంజొరనయ్యెడువేళ, నృత్తమం
దడుగిడువేళ, మేలివ్యవహారమునల్పెడువేళ, శత్రునిం
బొడిచెడువేళ, వాద్యములఁబూని మెలంగగనైనవేళలన్
బిడియముఁబొందరాదనుచుఁ బెద్దలు తద్దయు నొక్కిపల్కరే? 65

శ్లో. యస్మిన్ దేశే నసన్మానో నప్రీతి ర్నచ బాంధవాః
నవిద్యా నాస్తిధనికో నతత్ర దివసంవసేత్.

చ. పదిలములైనసత్కళలు పాటిలకుండెడుచోటఁ బెల్లునె
ల్లిదము ఘటిల్లుచోట, నసలే ప్రియమన్నదిలేనిచోట, నా
పద లొదవంగఁ దోడుపడు బాంధవు లుండనిచోట, వేళ క
ష్పొదవనిచోట, నిల్వఁదగ దొక్కనిమేషముఁగూడ నేరికిన్: 66

శ్లో. శతేషు జాయతే శూర స్సహస్రేషుచ పండితః
దాతాభవతి కోటీషు వక్తాభవతి దుర్లభః.

గీ. ఎక్కడో నూటికొకశూరుఁ డెసఁగుచుండు
వేయికొక్కఁడు ప్రాజ్ఞుండు వెలయుచుండుఁ
గోటికొక్కండు నెఱదాత గొరలుచుండుఁ
గాని తగువక్త దొరకుట కష్టమెందు. 67

శ్లో. కుచేలినం దంతమలేనసంయుతం
బహ్వాశినం నిష్ఠురవాక్యభాషిణం
సూర్యోదయే చాస్తమయేచ శాయినం
విముంచతి శ్రీరపి చక్రపాణినమ్.

చ. కడుమలినంపువస్త్రములుగట్టెడువానిని, నిష్ఠురోక్తులన్
నుడువఁగజంకనట్టి కఠినుని, గ్రిమభంగిని దంతపంక్తులన్
గడుగనివాని, మిక్కుటముగా భుజియించెడువాని సంధ్యవే
ళల శయనించువానిఁ గమలాపతినేన్ సిరి వాసిపోవదే! 68

శ్లో. అసంతుష్టా ద్విజానష్టాః సంతుష్టాఏవ పార్థివాః
సలజ్జాగణికానష్టా నిర్లజ్జాచ కులాంగనా.

ఆ. వె. తుష్టిలేనివిప్రుఁ డష్టకష్టములందుఁ
దుష్టిగల్గునృపుఁడు నష్టమొందు
లజ్జగల్గియున్న లంజియ సెడిపోవు
లజ్జలేమి చెడుఁ గులపరిభాంగి. 69

శ్లో. కర్తాకారయితాచైవ ప్రేరక శ్చానుమోదకః
పుణ్యాకార్యే పాపకార్యే చత్వారస్సమభాగినః.

గీ చేయువాఁడును, ప్రేరణఁజేయువాఁడు
మించి మోదించువాఁడుఁ జేయించువాఁడుఁ
బాపపుణ్యాకార్యఫలంబుఁ బంచుకొందు
రెచ్చుతగ్గులు సుంతేని యెసఁగకుండ. 70

శ్లో. జిహ్వాగ్రే వర్తతేలక్ష్మీ ర్జిహ్వాగ్రే మిత్రబాంధవాః
జిహ్వాగ్రే బంధనప్రాప్తి ర్జిహ్వాగ్రే మరణంధ్రువమ్.

ఉ. నాలుక మంచిదౌనెడ ధనంబు లనంతముగాలభించు, నా
నాలుక మిత్రబాంధవజనంబును జేర్చును, బంధనమ్మునన్
నాలుకయే ఘటించు, మరణంబునుగూడ ఘటించు నాల్కయే
నాలుకమంచిదైనయెడ నాలుగునాడులు మంచివేయగున్. 71

శ్లో. శీతేఽతీతే వసన మశనం వాసరాంతే నిశాంతే
క్రీడారంభం కువలయదృశాం యౌవనాంతేవివాహం
సేతోర్బంధం పయసిచలితే వార్ధకే తీర్థయాత్రాం
విత్తేఽతీతే వితరణమతిం కర్తుమిచ్ఛంతి మూఢాః.

మ. చలికాలంబుగతింప వస్త్రమునకై, సాయంబునం దిండికై,
తెలవాఱన్ రతికై, బలంబుడుగఁ నర్థిన్యాత్రికై, వార్ధకం
బలమన్ బెండిలికై, జలప్రవాహములువాయన్ గట్టకై, విత్తముల్
తలఁగన్ దాతృతకై, కడంగుదురు ముగ్ధస్వాంతులౌ మానవుల్. 72

శ్లో. మనో మధుకరో మేఘో మానినీ మదనో మరుత్
మామదో మర్కటో మత్స్యో మకారాదశ చంచలాః.

కం. మదనుఁడు, మరుత్తు, మానిని,
మది, మత్స్యము, మధుకరంబు, మర్కటమును, మా
సుదతియు, మబ్బు, మదంబీ
పదియు మకారంబు నెన్న బహుచంచలముల్. 73

శ్లో. జామాతా జఠరం జాయా జాతవేదా జలాశయః
పూరితా నైవపూర్యంతే జకారాః పంచదుర్భరాః.

గీ. జాతవేదుఁడు, జామాత, జాయ, జలధి,
జఠర మీ జకారములైదు జగతియందు
నింపుచున్న కొలందియు నిండుపడక
యెంతయో దుర్భరంబులై యెసఁగుచుండు. 74

శ్లో. అనుచితకార్యారంభః స్వజనవిరోధో బలీయసాస్పర్ధా
ప్రమదాజనవిశ్వాసో మృత్యోర్ద్వారాణి చత్వారి.

చ. అనుచితమైన కార్యముల నాచరణం బొనరింపనౌటయున్
వనరుహనేత్రిలందుఁ గడునమ్మకముంచుట, యాత్మబంధులౌ
జనములపట్లవైరమును, జాల బలిష్ఠునితోడిస్పర్ధయున్
గన నివినాల్గు మృత్యుసముఖంబునకున్ నడిపించుమార్గముల్. 75

శ్లో. జలబిందునిపాతేన క్రమశః పూర్యతేఘటః
సహేతుః సర్వవిద్యానాం ధర్మస్యచ ధనస్యచ.

ఉ. ఒక్కొకముక్కచొప్పున సమున్నతినేర్వఁగ విద్యపెంపగున్

ఒక్కొకమాడచొప్పున నియుక్తిగఁగూర్ప ధనంబువర్ధిలున్
ఒక్కొకనల్లుఁచొప్పున మహోన్నతినేర్చిన ధర్మమేర్పడున్
ఒక్కొకబిందువే యిడుటకోపిన నిండి ఘటంబు పొర్లెడున్. 76

శ్లో. ఆలస్యం స్త్రీసేవా సరోగతా జన్మభూమివాత్సల్యం
సంతృప్తి ర్భీరుత్వం షట్ వ్యాఘాతా మహత్వస్య.

చ. అలసతయున్, సరోగతయు, నంబురుహాక్షులసేవయందు ని
చ్చలు మునుగొందియుండుటయు, జన్మమునొందినభూమియందు వ
త్సలతయు, భీరుతాగుణముచాలగనుంటయు, తృప్తియుంటయున్
బలితములైనవిఘ్నములు మానవజాతిమహత్వలబ్ధికిన్. 77

శ్లో. అర్థాతురాణాం నగురు ర్నబంధుః
కామాతురాణాం నభయం నలజ్జా
విద్యాతురాణాం నసుఖం ననిద్రా
క్షుధాతురాణాం నరుచి ర్నపక్వమ్.

ఉ. పాపపుటర్థకామునకు బంధుఁడు లేఁడు గురుండు లేఁడు, వి
ద్యాపరుఁడైనవానికి సుఖాప్తిసుషుప్తులు లేవు, మన్మథ
వ్యాపృతుఁడైనవానికి భయంబును సిగ్గును లేవు, క్షుద్వ్యథా
వ్యాపకుఁడైనవానికి సుపక్వరుచుల్ గనుపట్టవెందులన్. 78

శ్లో. అతిపరిచయా దవజ్ఞా సంతతగమనా దనాదరో భవతి
మలయే భిల్లపురంధ్రీ చందనతరుకాష మింధనంకురుతే.

చ. కలుగునవజ్ఞ మిక్కుటముగా నతిమైత్రిఘటిల్లునేని, పెం
పొలము ననాదరంబు విడకుండ నిరంతరమేగునేని, య
మ్మలయమహీధరాంతరసమంచిత భిల్లపురంధ్రులెల్ల రు
జ్వలహరిచందనద్రుమవితానము వాడరె? వంటకట్టెకై. 79

శ్లో. అతిపరిచయా దవజ్ఞాభవతి విశిష్టేపి వస్తుని ప్రాయః
కాశీవాసీపురుషః కూపస్నానంసమాచరతి.

కం. అతిపరిచయవశమున న
పృతిహతమై పే రనాదరమ్ముఘటిల్లున్
క్షితిపైఁ గాశినివాసుఁడు
కుతుకమ్మునఁ గూపమందె కుృంకులు వెట్టున్. 80

శ్లో. వాగ్వ్యాద మర్థసంబంధం పరోక్షే దారభాషణం
యత్రమిత్రత్వ మిచ్ఛంతి తత్ర త్రీణినకారయేత్.

చ. మునుకొని వేనితోఁగలిసి పొందొనరింపఁగఁ దాఁదలంచు, న
మ్మనుజునితోడ మానవలె మాటికివాదము, నిచ్చిపుచ్చుకొం
టను నెఱపంగఁబోల దొకనాఁడును, వానిపరోక్షమందు నా
తనిసతితోడ ముచ్చటలుద్రవ్వుట తప్పకమానఁగాఁదగున్. 81

శ్లో. స్వాతంత్ర్యంపితృమందిరే నివసతి ర్యాత్రోత్సవేసంగతి
ర్గోష్ఠీ పూరుషసన్నిధానని యమో వాసోవిదేశే తథా
సంసర్గ స్సహపుంశ్చలీభి రసకృ ద్వృత్తేర్నిజా యాః క్షతిః
పత్యుర్వార్ధకమీర్షితం ప్రహసనం నాశస్య హేతుస్త్రియః.

ఉ. పుట్టినయింటనుంటయును, బూరుషగోష్ఠి, నిజేశుముద్మియున్,
గట్టడలేమి, యాత్రదెసఁగాంక్ష, స్వతంత్రత, దూరవాసమున్,
గట్టిడిచేడెచెల్మి, తిరునాళ్ళకుఁబోవుట, యట్టహాసమున్
బెట్టిదమైనవర్తనము బిత్తరికివ్వి వినాశహేతువుల్. 82

శ్లో. తస్కరస్యవధోదండో దాసీదండస్తు ముండనమ్
భార్యాదండః పృథక్శయ్యా మిత్రదండ మభాషణమ్.

చ. తల గొఱిగించిపుచ్చుటయె దాసికిదండన, మైదుప్రాణముల్
దొలఁగఁగఁద్రోయఁబూనుటయె దొంగకుదండన, మింతికిన్ బృథ
క్తలిమమునందుఁబండుటయె దండన, దండన లింక నేటికిన్
బలుకకయుండుటొండె కఠినంబగుదండన నేస్తగాండ్రకున్. 83

శ్లో. అతిథి ర్యస్యభగ్నాశో గృహా త్ప్రతినివర్తతే
సతస్మై దుష్కృతందత్వా పుణ్యమాదాయ గచ్ఛతి.

ఉ. ఏగృహమేధిగేహమున కేగి యథార్హసపర్య నందు చొ
ప్పే గనలేక యయ్యతిథియేగునొ యాగృహమేధికిన్ నిజ
ప్రాగఘరాశి సర్వమును వారకయిచ్చి తదీయ పుణ్యాల
క్ష్మీగరిమమ్ము సర్వమును జేకొను నాతఁడు నిక్కువమ్ముగన్. 84

శ్లో. ఆపత్సుమిత్రం జానీయాత్ యుద్ధేశూర మృగేశుచిం
భార్యాంక్షీణేషువిత్తేషు వ్యసనేషుచబాంధవాన్.

చ. రణమునశూరుశక్తి, వినరానివిపత్తున మిత్రుమైత్రియున్
ఋణములలోమునింగినపుడే నరుమంచితనమ్ము, వైభవం
బణఁగినయప్పుడే సతియుదారగుణోన్నతియున్ బృథువ్యథా
గణము పెనంగి చుట్టుకొనఁ గాంచఁదగున్ భువి బంధుబంధుతల్. 85

శ్లో. ఉద్యోగః కలహః కండూః ద్యూత మద్య పరస్త్రియః
ఆహారం మైథునం నిద్రా సేవ్యమానంతు వర్ధయేత్.

గీ. కలహ, ముద్యోగ, మన్యపంకరుహనేత్ర
మద్యపానంబు, నిద్దుర, మైథునంబు
ద్యూత, మాహారకంబుఁ, గండూతి యివ్వి
వృద్ధిఁబొందుచునుండు సేవించుకొలఁది. 86

శ్లో. సూపకారం కవిం వైద్యం మంత్రిణం మంత్రవాదినం
స్వామినం ధనికం మూర్ఖం మర్మజ్ఞం నప్రకోపయేత్.

గీ. తనదుగుట్టెఱింగినవాని, ధనికవరుని
సూపకారునిఁ బ్రభువును, శుద్ధమూర్ఖు
మంత్రినిఁ గవిని, వైద్యుని, మంత్రవిదునిఁ
గసరఁగారాదు కసరినఁ బొసఁగుదొసఁగు. 87

శ్లో. అర్థాగమో నిత్య మరోగతాచ ప్రియాచభార్యా ప్రియవాదితాచ
వశ్యశ్చపుత్రో ఒర్థకరీచవిద్యా షడ్జీవలోకేషు సుఖాని రాజన్.

చ. ధనమునలోటులేమి, సతతమ్మును రోగములేమి, తన్నుఁ బ్రే
మనుగను భార్యపొత్తు, తనమాటనుదాటనిపట్టి, మాటతీ

పినిఁ బ్రకటించు నేర్పు, కడువిత్తముఁ గూర్చెడు విద్య, యివ్వియా
ఱును సుఖసాధనంబులయి ప్రోదివహించు జగత్త్రయంబునన్. 88

శ్లో. దుర్వృత్తోవా సువృత్తోవా మూర్ఖః పండితయేవవా
కాషాయదండమాత్రేణ యతిఃపూజ్యో నసంశయః.

గీ. శిష్టమైనను వర్తనదుష్టమైనఁ
బండితుండైన వట్టిమూర్ఖుండెయైన
దండ కాషాయవస్త్రమాత్రంబు చేత
నర్చనీయుండు కర్మందియానతండు. 89

శ్లో. వైద్యరాజ నమస్తుభ్యం యమరాజసహోదర
యమస్తుహరతిప్రాణా న్వైద్యః ప్రాణాన్ ధనానిచ.

మ. మనుజశ్రేణుల ప్రాణసంచయములన్ మాత్రంబె కాలుండు, లా
గను సామర్థ్యముఁ గల్గువాఁ డితరమున్ గాఁజేయఁ డీవన్ననో
ధనమున్ బ్రాణముఁ గూడ లాగుదువుగాదా! ధర్మరాట్సోదరా!
కనరాఁ బోకుముమమ్ము నీకొక నమస్కారంబు వైద్యోత్తమా! 90

శ్లో. అక్షరద్వయమభ్యస్తం నాస్తినాస్తీతి యత్పురా
తదిదం దేహిదేహీతి విపరీత ముపస్థితమ్.

చ. ఎవఁడు పురాభవమ్మున నహీనధనంబున కీశుఁడయ్యుఁ బే
రవమతి 'నాస్తినాస్తి' యను నక్షరయుగ్మక మభ్యసించి, తా
నవిరళభంగి సద్వ్రతరణాఢ్యుఁడుగాఁడో యతండు భావియా
భవమున 'దేహిదేహి' యను పాటను పాడుచునుండు నిత్యమున్.

శ్లో. కో నయాతి వశంలోకే ముఖే పిండేన పూరితః
మృదంగో ముఖలేపేన కరోతి మధురధ్వనిమ్.

గీ. ఇంతయన్నంబు నోటి కందిచ్చునెడలఁ
బృథివి నెవ్వారలును వశీకృతులుగారె?
ముఖమునం దింతబోనంబుఁ బూయునంత
మధురనాదంబు నీనదే మర్దళంబు. 92

శ్లో. చత్వారో ధనదాయాదాః ధర్మాగ్నినృపతస్కరాః
తేషాం జ్యేష్ఠావమానేన త్రియఃకుప్యంతి బాంధవాః.

గీ. ధర్మ, మగ్నియు, నృపుఁడును, దస్కరుండు
నర్థమునకు నల్గురును దాయాదులగుదు
రందు నవమానమును జ్యేష్ఠుఁ డందు నేని
తక్కబంధులుముగ్గురు క్రోధమువహింతురు. 93

శ్లో. లుబ్ధానాం యాచకశ్శత్రు శ్చోరాణాం చంద్రమారిపుః
జారస్త్రీణాం పతిశ్శత్రుః మూర్ఖాణాంబోధకోరిపుః.

గీ. చోరునకు శీతరోచి నిష్ఠురవిరోధి
జారకాంతకు నాథుండు ఘోరవైరి
బాలిశున కుపాధ్యాయుండు ప్రబలరిపుఁడు
పిసినిగొట్టున కలయర్థి భీకరారి. 94

శ్లో. సుజనో నయాతివికృతిం పరహితనిరతో వినాశకాలేపి
ఛేదేపి చందనతరుః సురభియతి ముఖం కుఠారస్య.

కం. పరహితరతమతి వికృతిం
బొరయఁడు నాశంబుఁ దానుబొందెడునపుడున్
పరశునకిడదే సురభిని
నఱుకొందంగనియుఁ జందనద్రుమ మెందున్. 95

శ్లో. ఇతరపాపఫలాని యథేచ్ఛయా
విలిఖితాని సహే చతురానన
అరసికేషు కవిత్వనివేదనం
శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ.

చ. పరమదయానిధీ! యితరపాపఫలంబు లవెన్ని యేని, నా
శిరమున నిచ్చవచ్చినటు చిక్కగవ్రాసిన సైతు నోవిధీ!
అరసికులైనవారలకు హారికవిత్వముఁ జెప్పుమంచు దు
ర్భరమగువ్రాఁత వ్రాయకుము, వ్రాయకు వ్రాయకు వ్రాయఁబోకుమా!

శ్లో. క్షణశః కణశశ్చైవ విద్యా మర్థంచసాధయేత్
క్షణత్యాగే కుతోవిద్యా కణత్యాగే కుతోధనమ్.

గీ. కణముకణముగఁ దా ననుక్షణము నరుఁడు
ధనము విద్యయు నార్జింపఁదగునుజూవె.
కణమువిడిచిన నింక నెక్కడిదిధనము ?
క్షణమువిడిచిన నింక నెక్కడిదివిద్య ? 97

శ్లో. విశాఖాంతంగతా మేఘాః ప్రసవాంతంహి యౌవనం
ప్రణామాంతంసతాంకోపో యాచనాంతంహి గౌరవమ్.

ఉ. అంతటియౌవనంబుఁ బ్రసవాంతముగా దిగజాఱు, సత్ప్రణా
మాంతముగా సుధీజనచయంబులకోపముదీఱు, నవ్విశా
ఖాంతముగా నడంగుఁ జటులాంబుదమండలడంబరంబు, యా
చ్ఞాంతముగా నశించుఁజుమి యప్పటికుండినగౌరవోన్నతుల్. 98

శ్లో. క్షాంతితుల్యంతపోనాస్తి సంతోషాన్న సుఖంపరం
నాస్తి తృష్ణాసమోవ్యాధిః నచ ధర్మోదయాపరః.

గీ. క్షాంతితోఁదుల్యమగు తపశ్చర్య లేదు
హర్షమునుమించునట్టి సౌఖ్యంబు లేదు
ఆశకంటెను వేఱొక్క వ్యాధి లేదు
దయనుమించినధర్మ మిద్ధాత్రి లేదు. 99

శ్లో. సద్భావోనాస్తి వేశ్యానాం స్థిరతానాస్తి సంపదాం
వివేకోనాస్తి మూర్ఖాణాం వినాశోనాస్తి కర్మణామ్.

కం. వెలయాలికి సద్భావము
కలిమికి సుస్థిరత మరియుఁ గర్మంబులకుఁ
బ్రళయము వైధేయజనం
బులకు వివేకంబు మింటిపూవులుగావే ! 100

శ్లో. అతిదర్పే హతాలంకా అతిమానేచ కౌరవాః
అతిదానే బలిర్బద్ధః సర్వ మత్యంతగర్హితమ్.

మ. అతిదర్పంబుననీల్గె రావణుఁడు శౌర్యస్థైర్యముల్ గల్గియున్
అతిమానంబునఁగూలెఁ గౌరవుఁ డురుజ్యామండలం బుండియున్
అతిదానంబున బద్ధుఁడయ్యె బలి సత్త్వైశ్వర్యముల్ పొల్చియున్
అతి సర్వత్రవిసర్జనీయ మతి సర్వా నర్థదం బెప్పుడున్. 101

శ్లో. విద్వత్కవయఃకవయః కేవలకవయస్తు కేవలంకపయః
కులజాజాయా జాయా కేవలజాయాతు కేవలంమాయా.

కం. కవులనఁబడుదురు విద్వ
త్కవులే కేవలపుఁగవులు కపులౌదురుగా
తవుజాయయన, సుకులసం
భవ, కేవలజాయయన్న మాయయె కాదే! 102

శ్లో. దాతాదరిద్రః కృపణో ధనాఢ్యః
పాపీచిరాయు స్సుకృతీగతాయుః
రాజాఽకులీన స్సుకులశ్చభృత్యః
కలౌయుగే షడ్గుణ మాశ్రయంతి.

ఉ. దాతదరిద్రుఁడౌను, బలితమ్మగులోభగుణంబుగల్గు దు
ర్జాతుఁడు విత్తవంతుఁడగుఁ బ్రాకటపాపసమేతుఁ డాయుర
న్వీతుఁడగున్, బ్రపుణ్యుఁడు వినిర్గళితాయువగున్, భటుండు వి
ఖ్యాతకులుండగున్, నృపుఁడు కాకులజుండగు, నిమ్మహాకలిన్. 103

శ్లో. కుగ్రామవాసః కుజనస్యసేవా కుభోజనం క్రోధముఖీచ భార్యా
మూర్ఖశ్చ పుత్రో విధవాచపుత్రీ వినాగ్నినా సందహతేశరీరమ్.

ఉ. చెడుపురమందుఁగాపురముఁ, జెడ్డమనుష్యునిసేవ, దుష్టపా
కుడుపు, నిరంతరమ్ముఁ గ్రుధగూరినమోముగలట్టిభార్య, మూ
ర్ఖుఁడయిన పుత్రుఁడున్, విధవకూఁతురు నియ్యవి యగ్నిలేకయే
యొడలిని భగ్గుభగ్గుమని యుద్ధవిడిన్ దహియించు నెంతయున్. 104

శ్లో. అనాయకా వినశ్యంతి నశ్యంతి శిశునాయకాః
స్త్రీనాయకా వినశ్యంతి నశ్యంతి బహునాయకాః.

గీ. నాయకుఁడులేక కార్యం బణంగిపోవు
నాయకుఁడు బాలకుండైన నష్టిగలుగు
బోటి నాయకురాలైనఁ జేటుగల్గు
నాయకులు పెక్కురైనను నాశమొదవు. 105

శ్లో. అసారేఖలు సంసారే సారం శ్వశురమందిరం
హిమాలయే హరశ్శేతే హరిశ్శేతే మహోదధౌ.

గీ. సారవిరహితమైన సంసారమందు
శ్వశురమందిరమే సౌఖ్యసద్మమగుట
పాలమున్నీట విష్ణుండు పవ్వళించె
మంచుమలయందు వసియింపఁగాంచె శివుఁడు. 106

శ్లో. రాజవత్ పంచవర్షాణి దశవర్షాణి దాసవత్
ప్రాప్తేతు షోడశేవర్షే పుత్రం మిత్రవదాచరేత్.

ఉ. పంచశరద్వయస్కుఁడగు బాలుని భూపతితోసమంబుగా
నెంచి, పదేడులీడు మరియేర్పడ దాసునితోసమంబుగాఁ
గాంచుచు, షోడశాబ్దములకాలమునందు సుహృత్సమంబుగాఁ
గొంచక యెంచఁగావలయుఁ గోవిదులైనజనుల్ తనూజులన్. 107

శ్లో. దుర్జనం కాంచనం భేరీం దుస్స్త్రియం దుష్టవాహనం
ఇక్షుఖండాన్ తిలాంశ్చైవ మర్దయే ద్గుణవృద్ధయే.

చ. కనకము, నిక్షుఖండమును, గాపురుషున్ గడుదుశ్చరిత్రయౌ
వనితను, భేరినిన్, బరుగువాఱనివాహనమున్, దిలోత్కరం
బును, జదువన్న మొండితనమున్ బ్రకటించెదు బాలురన్, విమ
ర్దన మొనరించుకొద్ది పలుదారులఁ దాగుణవర్ధనంబగున్. 108

శ్లో. బాలార్కః ప్రేతధూమశ్చ వృద్ధస్త్రీ పల్వలోదకం
రాత్రౌ దధ్యన్నభుక్తిశ్చ ఆయుఃక్షీణం దినేదినే.

గీ. ప్రేతధూమంబు, బాలఖద్యోతనుండు
పల్వలపునీరు, ముదుసలివాలుఁగంటి

రాత్రి దధ్యన్నభుక్తి సంప్రాప్తమైన
మనుజునాయువు క్షీణించు ననుదినంబు. 109

శ్లో. వృద్ధార్క హోమధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకం
రాత్రౌ క్షీరాన్నభుక్తిశ్చ ఆయుర్వృద్ధి ర్దినేదినే.

గీ. హోమధూమంబు; వృద్ధఖద్యోతనుండు
నిర్మలోదకంబును, బాలనీలవేణి
రాత్రి క్షీరాన్నభుక్తి సంప్రాప్తమైన
మనుజునాయువు వర్ధిల్లు ననుదినంబు. 110

శ్లో. జలప్రమాణం కుముదస్యనాళం
కులప్రమాణం పురుషస్యశీలం
శాస్త్రప్రమాణం విదుషాంతు వాక్యం
భూమిప్రమాణం తృణవృక్షవృద్ధిః.

చ. పలికెడుపల్కులే తెలుపుఁ బ్రాజ్ఞవరుంగల శాస్త్రపాండితిన్
గలువలకాడలే, తెలుపఁగల్గు జలంబులలోఁతు, శీలమే
తెలుపును, వంశగౌరవముఁ దీవలయుం దరుపాళియుం దృణం
బులయు, సమృద్ధియే తెలుపు భూమికిఁగల్గిన సారసంపదన్. 111

శ్లో. అశక్తస్తస్కరస్సాధుః కురూపాచేత్పతివ్రతా
రోగీచ దేవతాభక్తో వృద్ధావేశ్యా తపస్వినీ.

ఆ. వె. శక్తిలేనివాఁడ సద్వర్తనుండగు
వ్యాధిగతుఁడు దైవభక్తుఁ డగును
బహుకురూపకాంత పరమసాధ్వి యగును
వృద్ధవేశ్య నియమబద్ధ యగును. 112

శ్లో. పితాచ ఋణవాన్ శత్రుః మాతాచ వ్యభిచారిణీ
భార్యా రూపవతీశత్రుః పుత్రశ్శత్రు రపండితః.

చ. అతిఋణవంతుఁడైనపిత యగ్గలపుంబగవాఁడు, రూపమం
దతులితమైనభార్య యభిమాతియగున్, వ్యభిచారదోషసం

గతయగుతల్లి శత్రువయి కన్పడుచుండు, నిరక్షరాస్యుఁడౌ
సుతుఁడు కఠోరశత్రువయి చొప్పడుఁగాదె తలంచిచూడఁగన్. 113

శ్లో. పుస్తకం వనితా విత్తం పరహస్తంగతంగతమ్
అథవా పునరాయాతి జీర్ణం భ్రష్టాచ ఖండశః.

గీ. పరులహస్తానఁ బొత్తంబుఁ, దరుణి, ధనముఁ
బడిన వచ్చునె, ట్లొకవేళ వచ్చెనేని
చినిగి పొత్తంబు, భ్రష్టయై వనజనేత్ర
భాగములఁజెంది, యపుడప్డు వచ్చుధనము. 114

శ్లో. నాలసాః ప్రాప్నువంత్యర్థా న్నశఠా నచమాయినః
నచ లోకరవాద్భీతా నచ శశ్వత్ప్రతీక్షిణః.

గీ. అలసులును, వంచకులును, లోకాపవాద
భయచలితమానసులును, గేవలశఠులును
మాటిమాటికి శంకించు మానవులును
అందఁగానేర రెందు నిష్టార్థములను. 115

శ్లో. భార్యావియోగశ్చ జనాపవాదో ఋణస్య శేషః కుజనస్య సేవా
దరిద్రకాలే ప్రియదర్శనంచ వినాగ్నినా పంచ దహంతి కాయమ్.

చ. సతి నెడబాసియుండుటయుఁ జాలగ లేపడిగల్గుపట్టునన్
హీనునిసమాగమంబు, గుణహీనునికొల్వుననిల్వఁ గంటయున్
వితతజనాపవాదమును, బెల్లగునప్పుల మున్గుచుంటయున్
గుతకుతవెట్టుఁగాయము నకుంఠితరీతిని నిప్పులేకయే. 116

శ్లో. ఉత్సాహ స్సాహసం ధైర్యం బుద్ధి శ్శక్తిః పరాక్రమః
షడేతే యత్ర తిష్ఠంతి తత్ర దేవోపి తిష్ఠతి.

ఉ. ఎచ్చట సాహసంబొదవు, నెచ్చట ధైర్యమునివ్వటిల్లుఁ దా
నెచ్చట శక్తిపెంపెసఁగు, నెచ్చటఁబొల్చుఁ బరాక్రమంబు, నిం
కెచ్చట బుద్ధిరాజిలు, నికెచ్చట విక్రమచేష్టయుండునో
యచ్చట సర్వకాలములయందు వసించుచునుండు దేవుఁడున్. 117

శ్లో. ద్వారంద్వార మటన్ భిక్షుః శిక్షత్యేవ నయాచతే
అదత్వా మాదృశోమాభూః దత్వాత్వం తాదృశోభవ.

శా. ద్వారద్వారమునందు భిక్షుకుఁడు చేతం బాత్రముంగొంట, యా
చ్ఞారక్తుండయి కాదుకాదుసుడి, శిక్షంజేయఁగాఁబూని, యి
"ట్లౌరా! దానములేక నావలెను భిక్షారాధకుల్ గాకుఁ డ
వ్వారిం బెట్టుచుఁ గండు, మీరవలెనె సంపద్యుక్తులై యెప్పుడున్. 118

శ్లో. అస్థిరం జీవనం లోకే అస్థిరం యౌవనం ధనమ్
అస్థిరం దారపుత్రాది ధర్మకీర్తిద్వయం స్థిరమ్.

ఉ. జీవన మస్థిరంబగుట సిద్ధము, నశ్వర మర్థసంపదల్
యౌవన మస్థిరంబగుచు నంతకునంతకు జాఱిపోవు, నిం
కేవి తిరంబు లోకమున, నింతియుఁ బుత్రులు నస్థిరంబులే
స్థావరమై యెసంగునవి, ధర్మముఁ గీర్తియు రెండుమాత్రమే. 119

శ్లో. బాలసఖిత్వ మకారణహాస్యం స్త్రీషు వివాద మసజ్జనసేవా
గార్దభయాన మసంస్కృతవాణీ షట్సు నరో లఘుతాముపయాతి.

చ. కలుకులతో వివాదమును, గార్దభయానము, హేతువింతయున్
గలుగనినవ్వు, దుర్జనగుణమ్ములసేవయు, బాలకాళితో
సలుపఁగనైనచెల్మియు, నసంస్కృతవాణియు నివ్వి యాఱునున్
జులుకఁదనమ్ముఁగూర్చి తొలఁచున్ జుమి మానవుగౌరవోన్నతిన్.

శ్లో. ప్రస్తావసదృశం వాక్యం స్వభావసదృశీం క్రియాం
ఆత్మశక్తిసమం కోపం యోజానాతి సపండితః.

గీ. సమయ సముచిత వాక్యసంచయము లాడి
యాత్మశీలోపమక్రియ లాచరించి
తనదు శక్తినిమించుక్రోధంబు విడిచి
యుండునాతఁడె యుద్దండపండితుండు. 121

శ్లో. దుర్జనగమ్యానార్యః ప్రాయేణాపాత్రభృద్భవతి రాజా
కృపణానుసారిచ ధనం దేవో గిరిజలధివర్షీ చ.

గీ. రమణు లాశింతు రెప్పుడు దుర్జనులపొత్తు
నృపుఁ డపాత్రజనము నే భరించుచుండుఁ
గడుఁ బిసినిగొట్టునే లక్ష్మి గౌఁగిలించు
గిరుల జలధుల మేఘుండు గురియుచుండు. 122

శ్లో. అర్థా గృహే నివర్తంతే శ్మశానే మిత్ర బాంధవాః
సుకృతం దుష్కృతంచైవ గచ్ఛంత మనుగచ్ఛతి.

చ. ధనమనుకాంత గుమ్మమును దాఁటుచు వెన్కనె దింత యేనియుఁన్
తనవనజాక్షియుఁన్, సుతులు, దగ్గరబంధులు, వల్లకాటిదా
క, నెటులో వెంబడించి మఱి క్రమ్మఱిపత్తురు, వెంటవత్తురే
మనుజునిపాపపుణ్యములుమాత్రమె పాయక వెంటనంటెడుఁన్. 123

శ్లో. ఆశాతురంగ మారుహ్య నిత్యం ధావంతి యాచకాః
కించి త్తండులమాత్రాయ శాకాయ లవణాయచ.

చ. కొఱపడు 'కానిడబ్బనకుఁ' గూరకు, నారకుఁ, దంపులాలకున్
మిరపకు, నుప్పుఁగల్లునకు, మేకొని, యాచకుఁ డాశ పేరిటన్
బరఁగు తురంగమెక్కి బహుభంగులఁ బిల్చిన నాగకెచ్చటన్
బరుగులువాఱుచుండును, జవంబెసలారఁగ వీథివీథికిన్. 124

శ్లో. కాకయాచకయోర్మధ్యే వరం కాకో నయాచకః
కాకా నాహూయతే కాకః యాచకో నైవయాచకమ్.

ఉ. ఏకడ నెన్వఁడేని తనయెంగిలిచేయి విదిల్చెనేని య
క్కాకముపిల్చు దానిబలగంబును "కా"యని, యట్టిసంగతిన్
దాఁకగఁనీఁడు యాచకుఁడు తమ్ముని కేనియు స్వార్థపరియై
కాకము యాచకాధమునికంటె, సహస్రవిధాల మేలగున్. 125

శ్లో. సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్
చక్రవత్పరివర్తంతే దుఃఖానిచ సుఖానిచ.

చ. కలుములవెంట లేములును, గల్మిలు లేములవెంట, నిర్లు జా
బిలిగమివెంటఁ బేరిరులవెంటను జాబిలి, హాయివెంటఁ బే

రలఁత, యలంతవెంటఁ గడుహాయి, క్రమంబుగ నిల్లె చక్రముం
బలెఁ బరివర్తనంబెనయవా? సుఖదుఃఖము లెట్టివారికిన్. 126

శ్లో. కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతాం
వ్యసనేనచ మూర్ఖాణాం నిద్రయా కలహేనవా.

గీ. కావ్యశాస్త్రవినోద సత్కాలలయుండె
కాలమంతయు ధీనిధుల్ గడపుచుంద్రు
వ్యసనములఁ గలహముల నిద్రాదులందె
కాలమంతయు బాలిశుల్ గడపుచుంద్రు. 127

శ్లో. అంగం గళితం పలితం ముండమ్
దశనవిహీనం జాతంతుండమ్
వృద్ధో యాతి గృహీత్వా దండమ్
తదపి నముంచ త్యాశాపిండమ్.

ఉ. తుండమునందు దంతములు దూలి యొకండును లేకయుండినన్
ముండము ముగ్గుబుట్టవలెఁ బొల్చిన, వార్ధకభీతిఁ జేతికిన్
దండమె యండయైనఁ దనుదండము జాఱిన, నాశపేరి య
ప్పిండముమాత్ర, దా, విడిచిపెట్ట దదెంతటి గట్టిపిండమో. 128

శ్లో. దూతికాసూతికాచైవ రత్యంతే నైవభామినీ
ఉపాధ్యాయశ్చ వైద్యశ్చ కార్యాంతే పంచ నిష్ఫలాః.

గీ. సూతికయు, దూతికయు, వైద్యనేత, గురుఁడు
నావ, రత్యంతమందలి నలిననయన
యవసరము తీఱుపిమ్మట నమ్మచెల్ల!
గడ్డిపోచకేనియు, నెనగావుగాదె. 129

శ్లో. అవస్థాపూజ్యతే రాజ న్నశరీరం శరీరిణాం
తదా వనచరో రామ ఇదానీం నృపతాంగతః.

ఉ. రాజితకీర్తనీయుఁడగు రాముఁడు కానలకేగు వేళ, ని
స్తేజిత కందమూలఫలజీవనభుక్తి, నయోధ్యకున్ మహా

రాజుగ వచ్చు వేళ, రుచిరప్రదభక్ష్యము లెన్నియో, భర
ద్వాజుఁ డొసంగెఁ బూజిత మనస్థయె, దేహముగాదు చూడఁగన్.

శ్లో. విద్యాశ్చతస్రోఽసాధ్యాస్స్యుర్జన్మనా సహ సంభవాః
గాంధర్వంచ కవిత్వంచ శూరతా దానశీలతా.

చ. పిదపిదయైరహించు సుకవిత్వము శౌర్యము దానగానముల్
పొదలవలెన్ నిసర్గతను పుట్టుకతోడనె, యీర్ష్యపెంపునన్
జదివిన, నేర్చినన్, మిపులశ్రద్ధవహించిన, నభ్యసించినన్
బదిలపడంగనేర, వల ప్రాక్సుకృతంబునఁగాక యెందులన్. 131

శ్లో. శ్రద్ధానుసారిణీ విద్యా కర్మానుసారిణీ బుద్ధిః
యత్నానుసారిణీ లక్ష్మీః భాగ్యానుసారిణీఫలమ్.

గీ. అభ్యసించినకొలఁదియు నమరు విద్య
పూర్వకర్మంబుకొలఁదియై పొదలుబుద్ధి
యత్నముకొలంది లభియించుటగును లక్ష్మి
భాగ్యముకొలంది ఘటియిల్లు ఫలముభువిని. 132

శ్లో. ఆత్మానదీ సంయమపుణ్యతీర్థా
సత్యోదకా శీలతటా దయోర్మిః
తత్రాభిషేకం కురు పాండుపుత్ర
నవారిణాశుద్ధ్యతి చాంతరాత్మా.

చ. చెలువగుసత్యమేజలము, శీలమెకూలము, మేలిజాలియే
కలితతరంగసంచయము, గాటపుటింద్రియనిగ్రహంబె, రే
వలరు సదాత్మయే తటిని, యందుమునింగిన యంతరాత్మకుం
గలుగు విశుద్ధి కాకఁబలె గంగనుగ్రుంకిన లాభమున్నదే ? 133

శ్లో. తపసా జాయతే లక్ష్మీ లక్ష్మ్యా సంజాయతే మదః
మదేన జాయతే పాపం పాపేన హన్యతే లోకః.

గీ. తపమువలనను సిరిగల్గు, దానివలన
మదము సంజాతమగుచుండు, మదమువలనఁ

బాపపుంజంబు ఘటియిల్లుఁ బాపమునను
ప్రాణిలోకంబు, సరకానఁ బతితమగును. 134

శ్లో. చలంచిత్తం చలంవిత్తం చలే జీవనయావనే
చలాచల మిదంసర్వం కీర్తి ర్యస్య సజీవతి.

చ. పలుమఱుసంచలించుఁ గపిభంగి మనంబు, ధనంబుకూడఁ జం
చలము, మనోజ్ఞయావనము జానగుజీవనముందలంపఁ జం
చలములు, విశ్వమంతయును జంచలమే, యటుగానఁ గీర్తికిక్
నెలవగు వాఁడె సుస్థిరత నిల్వఁగనేరుచు నీజగంబునక్. 135

శ్లో. చితి చింతా ద్వయోర్మధ్యే చింతానామ గరీయసీ
చితిర్దహతి నిర్జీవం చింతా ప్రాణయుతంవపుః.

గీ. చితియుఁ జింతయు నను రెండు చెట్టలందు
నెన్నఁ జింతయే కడుమిన్న యెట్లటన్నఁ
జితి దహింపఁగనేర్చు, నిర్జీవములను
చింత దహియించివైచు సజీవములనె. 136

శ్లో. పరోపదేశసమయే సర్వ యేవహి పండితాః
స్వానుష్ఠానస్యసమయే మునయోపి నపండితాః.

గీ. పరుల కుపదేశమొనరించు పట్టులందు
నందఱునుగూడఁ బండితులైనవారె
తామె యది యాచరించెడుతఱుణమందుఁ
బండితులుగారు, వా రెంతప్రాజ్ఞులైన. 137.

శ్లో. మృత్పిండ ఏకో బహుభాండరూప స్సువర్ణమేకం బహుభూషణాని
గోక్షీరమేకం బహుధేనుజాత మేకం పరాత్మా బహుదేహవర్తీ.

చ. విలువగలట్టిభూషలవి, వేలుఘటిల్లిన, స్వర్ణమొక్కటే
కలశము లెన్నిరూపములఁ గ్రాలఁగఁగన్నను, మట్టియొక్కటే
పొలుపగుగోవు లెన్నిటను బొల్చుచునుండిన, క్షీరమొక్కటే
పలుతెగలైనదేహముల వర్తిలుచుండిన, దేవుఁడొక్కఁడే. 138

శ్లో. మణిర్లుఠతిపాదేన కాచ శ్శిరసి ధార్యతే
యథైవాస్తు తథైవాస్తు కాచఃకాచో మణిర్మణిః.

గీ. ఘనతరంబగుమణిని ముంగాలఁదన్ని
కదియఁజేతురు తలపైని గాజుపూస
నేదియెట్లైన మణి మణియే, నిజమ్ము
గాజు తానెప్పుడుంగూడ గాజె కాదె? 139

శ్లో. సగుణో నిర్గుణోవాపి సహాయో బలవత్తరః
తుషేనాపి పరిభ్రష్ట స్తండులో నాంకురాయతే.

గీ. సగుణమైన నిర్గుణమైనఁ దగుసహాయ
మెపుడు బలవత్తరంబయి యొసఁగుచుండు
ఊకవిడిచిన తండులం బుదుటుగలిగి
మొలచునే యెంత సారంపుభూమి నిడిన. 140

శ్లో. రాజా రాష్ట్రకృతం పాపం రాజపాపం పురోహితః
భర్తాచ స్త్రీకృతంపాపం శిష్యపాపం గురుర్వ్రజేత్.

గీ. రాష్ట్రకృతిపాపపుంజంబు రాజు [illegible]
నృపతిసేయుపాపము పురోహితునిఁగొట్టు
భార్యయొనరించుపాపంబు భర్తపాలు
శిష్యపాపంబు గురువును జెందుచుండు. 141

చ. వననిధిమధ్యమందుఁబడు వర్షముఁ దృప్తిఘటింపలేని భో
జన, మొకపొట్టకేనియును జాలనిదానము, తారతమ్యముం
గనియు గ్రహింపకుండు నధికారులసేనయు, లేమియందు యౌ
వనమును, మిత్రఘాతికిడు భద్రము వ్యర్థము వ్యర్థ మిద్ధరన్. 142

చ. హితమగు కార్యసంతతుల నెందుఁజరించు నతండె బంధుఁడే
యతఁ డతిపోషకుండగునొ యాతఁడెతండిరి, యేమనుష్యునం
దతులితమైన నమ్మకమొ, యాతఁడె నెచ్చెలి, యేలతాంగి సం
తతసుఖదాత్రియున్ వినయధామమునౌ, నదె భార్యనాఁబడున్. 143

చ. పరువమునందుఁ బుత్రకుఁడు, బాల్యమునందు గడించువిద్య, స
త్పురుషునిమైత్రి, మోతుబరుపోంతనుదాచిన స్వాపతేయముల్
సరవిని మంచివానియెడ సల్పినమేలు, తఱిన్ సముప్తమై
వరలినపైరు నివ్వి పరిపక్వములై, పనిఁదీర్చు నక్కఱన్. 144

చ. ముదిమినిగల్గుపుత్రకుఁడు, పుస్తగతంబగువిద్య, కార్తిమా
న్పదుఁడగువానిమైత్రి, చెడువానికిఁ జేసినమేలు, దబ్బరన్
బొదలెడువాని కిచ్చుధనముల్, దఱియంబుననూడ్చనట్టి పై
రదవదగూర్చుఁగాని సమయంబున కక్కఱఁదీర్ప నేర్చునే? 145

గీ. అఖిలవిద్యాపరిపూరితుం డణఁగియుండు
నట్టివానికే ఘటియిల్లు మిట్టిపాటు;
అన్నిఁటిసిగల్గువిస్తరి యణఁగియుండ
నేమియును లేనివిస్తరి యెగిరిపడదె? 146

గీ. అన్నమిడి పోషించువాఁడును, గన్నతండ్రి
వడుగుఁ గావించువాఁడును, భయమునుండి
కాచువాఁడును, విద్యలం గఱపువాఁడు
వీరలేవురుఁ దండ్రులై వెలయువారు. 147

ఉ. ఏ చతురాస్యునోళ్కొలిచి, యెన్నియొ శాస్త్రములభ్యసించి, తా
నాచికొనంగనౌ ఫలము, నల్వుర కీఁగనినట్టివానికే
రాచి యలంచుటల్ గలుగు; పాయికభంగిని రాళ్ళదెబ్బ లా
కాచినచెట్లకే తగులుఁ గాయనిచెట్లకుఁ దాకుటెల్లగుల్. 148

గీ. ఇంద్రియముల నేయొకటి చలించి విషయ
పాతమును బొందిన హరించుఁ బ్రజ్ఞ నెల్ల
ఘటములోనున్న నీటినిఁ గార్చునైన
నొక్క రంధ్రంబుచాలదే పెక్కులేల? 149

మ. చదువన్నేర్చిన సర్వశాస్త్రములు, వాక్చాతుర్య మేపారినన్
దుదకొక్కండును నండలేనియెడ నెందుంబొందఁ డెవ్వాఁడునున్

బదిలంబైతగు గోడచేర్పనెడు నా ప్రాపొందు లేకున్నచో
పదియార్వన్నె పసిండిపళ్ళెమయినన్ భాసిల్లఁగా నేర్చునే? 150

గీ. భక్తిలేకున్నవానికి, వంచకునకు
వేదబాహ్యునకును, ధూర్తబృందమునకు
నాస్తికుండైనవాని కెన్నఁడును గురుఁడు
మంత్ర ముపదేశ మొనరింపమానవలయు. 151

మ. అసలేకోఁతి స్వభావచంచల మతివ్యాప్తింబ్రవర్తించు న
ప్పస, మాపైఁ గలుకూడఁద్రావ, నటుపైఁబట్టం బిశాచంబు, దీ
వసమేదన్ తెయితక్కలాడు నెడ నొవ్వంగుట్టఁగా ద్రోణ మే
పసనుండున్, మదియట్లె; కాన నరుఁ డవ్యాలోలుఁడౌ టొప్పగున్.

చ. పనిగొనిపిన్ననాఁటఁ జదువన్ లిఖియింపను నేర్వఁ జక్కఁగాఁ
బెనఁగొని యస్తిఁబట్టుకొని పీడదు, పెద్దతనాన నంట, దె
ట్లన: సరికొత్తవస్త్రమున కంటుఁ బసందుగరంగు, లంటునే
చినిఁగియు మాసిపోయియును జెన్నుదొఱంగిన ప్రాఁతపాతకున్. 153

చ. కలధనమెల్ల బీదలకుఁగా నిడి, తాను దరిద్రుఁడైనన్
దొలఁగకయుండుఁ దేజు, తఱిఁగో, యశమల్లుకొనున్ దిశావళిన్
సలలితరత్నమున్ మివుల సానను బెట్టఁగ, నెత్తుతగ్గినన్
వెలఘనపాటకాక యతినిర్మలకాంతుల నీనుచుండదే! 154

చ. దివిజులకున్ దివిన్, వసుమతీపతిజాతికి నాజి, మేదినీ
దివిజులకున్ సుశాస్త్రములఁ దీవలబోంట్లకు మోవులన్, జకో
రవితతికిన్ క్షపాకరకరంబులఁ, జాతకి కంబుదంబునన్
కవులకు వాక్కులం దమృతకంధులు సంధిలుఁ బోటుమీఱగన్. 155

చ. పుటమునఁ బెట్టఁగాఁబడియుఁ బుత్తడి వన్నెదొఱంగఁబోవ, దు
త్కటముగ భస్మమయ్యు సితకాంతులవీడదు సంకు, సానపై
దిటముగ రాపిడింబడియుఁ దేటుదొలంగదు మానికంబు, తాఁ
గటకటపాటునొందియును గట్టడఁదప్పఁడు ధీరుఁడెయ్యెడన్. 156

చ. కలధన మర్థికోటి కొసఁగందగు ఆస్తికుఁ డైనవానికిన్
సలలితభోగ మందఁదగు నాస్తికుఁడౌ నెడఁగాని రెంటికిన్
వెలియయి పాతిపెట్టుకొను వెంగలివిత్తుల కేమిహేతువుల్
గలవొకొ? పూర్వజన్మకృతకర్మవిపాకముగాక యీశ్వరా! 157

చ. పదుగురునున్న రాట్సభను భంగమునొందినవాఁడు, నిల్లడన్
బొదలినవాఁడు, నర్థులకుఁ బూజయొనర్పనివాఁడు, సంపదల్
ప్రిదిలినవాఁడు, గుట్టువెలిఁబెట్టెడువాఁడును వీర లేవురున్
బ్రదికియుఁ జచ్చిపోయినజనంబులకున్ సరివత్తు రిమ్మహిన్. 158

చ. స్తుతమతి నగ్రహారములుఁ దోటలు నాలయముల్, తటాకముల్
తతఃధు, లన్నసత్రములు ధర్మరతిన్ వెలయించువారలున్
గృతిగయికొన్నవారు, రచియించినవారును వీరు సచ్చియున్
బ్రతికినవారలై, యిహపరంబులనందుదు రెల్లసౌఖ్యముల్. 169

శ్లో. ఉత్తమా మానమిచ్ఛంతి ధనమానౌహి మధ్యమాః
అధమా ధనమిచ్ఛంతి మానోహి మహతాంధనమ్.

చ. ధనమొకఁడే సతమ్మని వితండమొనర్చెడువాఁడు నీచుఁ డా
ధన మభిమానముల్ గలయతం డలమధ్యముఁ డెట్టిపట్టుల
దెన గనరాని మానధనమే కలవాఁడు మహోత్తముండు, స
జ్జనులకు మానమేధనము తక్కుధనమ్ములు దంధనమ్ములే! 160

శ్లో. ఆశాయా యేదాసా స్తేదాసా స్సర్వలోకస్య
ఆశాదాసీ యేషాం తేషాం దాహాయ తేలోకః.

గీ. ఆసయను దాసికెవ్వండు దాసుఁడగునొ
వాఁ డఖిలలోక దాసుఁడై పరగుచుండు
నాసయనునది యెవనికి దాసియగునొ
వానికందఱు దాసులై వరలుచుంద్రు. 161

శ్లో. అర్థానా మార్జనేదుఃఖం ఆర్జితానాంచ రక్షణే
ఆయేదుఃఖం వ్యయేదుఃఖం ధిగర్థం దుఃఖభాజనమ్.

చ. ధనసముపార్జనంబు బహుధాశ్రమదంబగు, దానిరక్షణం
బును గడుదుఃఖదాయకము పోల్పఁగఁ, దత్పరిలబ్ధిరిక్త వ్యయ
మ్మునసయితమ్ముఁజొప్పడుఁ బరిభూతపుదుఃఖ మిదే! శ్రమైకభా
జనమగు నర్థసంగతికి సజ్జనుఁడెవ్వఁడు ప్రాకులాడెడున్? 162

శ్లో. ప్రాయేణ ధనినామేవ ధనలోభో నిరంతరం
పశ్య కోటిద్వయోపేతం లక్షాయప్రణతం ధనుః.

గీ. ఎన్నికోట్లున్న లోభి ధనేచ్ఛపేర్మి
నల్పవిత్తార్థమై వంగి యణఁగుచుండు
రెండుకోట్లుండఁగనియుఁ గోదండ మహహా!
పరఁగ లక్షార్థమై యిట్లు వంగుఁగాదె? 163

శ్లో. తానీంద్రియా ణ్యవికలాని తదేవనామ
సాబుద్ధి రప్రతిహతా వచనంతదేవ
అర్థోష్మణా విరహితః పురుషస్సయేవ
అన్యః క్షణేనభవతీతి విచిత్రమేతత్.

చ. కనుఁగును, ముక్కు, నోరు, చెవి, కాలును, గేలు సమస్తమవ్వియే
తనరెడుపేరదే, తెలివి. దార్ఢ్యము, మాటలు, చేష్టలవ్వియే
మనుజుఁడుగూడ వాఁడె పలుమాటలికేల? ధనంబుపోవ, నా
మనుజుఁడు వాఁడుకాఁడుసుమి! మారు, క్షణంబున నేమిచిత్రమో?

శ్లో. మాతానిందతి నాభినందతిపితా భ్రాతా నసంభాషతే
భృత్యఃకుప్యతి నానుగచ్ఛతిసుతః కాంతాచ నాలింగతి
అర్థప్రార్థనశంకయా నకురుతే ప్యాలాపమాత్రంసుహృత్
తస్మాదర్థముపార్జయ శృణుసఖే చార్థేన సర్వేవశాః

చ. జనకుఁడుమెచ్చుకోఁడు నిజజాయయుఁ గౌగిటఁజేర్చఁబోదు, త
జ్జననియు నిందసేయుఁ బరిచారకుఁడున్ గ్రుధఁబూను, సోదరుం
డును బలుకాఁడఁబోఁడు, సుతుఁడున్ విసిపించుకొనండు, విత్తమి
మ్మను నని మిత్రుఁడుంబలుకఁ డర్థవిహీనుఁడు వ్యర్థుఁడిమ్మహిన్. 165

శ్లో. పూజాకోటిసమం స్తోత్రం స్తోత్రకోటిసమో జపః
జపకోటిసమం ధ్యానం ధ్యానకోటిసమో లయః.

చ. అనితరసాధ్యపుష్పనిచయంబులపూజలు కోటికంటె, భ
క్తిని నుతియొండు మేలగు, నుతిప్రకరంబులు కోటిసల్పుకం
టెను జపమొండుమేలు, జపనిష్ఠలు కోటియొనర్చుకంటె, ధ్యా
ననియతిమేలు, ధ్యానము లనంతముకంటె లయంబుమేలగున్. 166

శ్లో. సముద్రమథనే లేభే హరిర్లక్ష్మీం హరో విషం
భాగ్యంఫలతి సర్వత్ర నవిద్యా నచపౌరుషమ్.

కం. అరయ నదృష్టమె హేతువు
హరి విద్యాపౌరుషములు మూలంబగునే?
పెరుమాళ్ళకు సిరిదొరకెను
హరునకు గరళంబుదొరకె నబ్ధిమథింపన్. 167

శ్లో. సదసి విదురభీష్మద్రోణశారద్వతానాం
పతిభి రమితవీర్యైః పంచభిః పాలితాపి
అహహ పరిభవస్య ద్రౌపదీ పాత్రమాసే
ద్బలవతిసతి దైవే బంధుభిః కింవిధేయుః.

చ. విదురుఁడు, ద్రోణుఁడున్, కృపుఁడు, భీష్ముఁడు, ధర్మపథావలంబకుల్
గదిసినసత్సభాస్థలి నఖండపరాక్రమవిక్రమక్రమా
ప్తులగు ధర్మజప్రముఖపాండవసింహులధర్మపత్ని ద్రౌ
పదికిఁ బరాభవంబొదవెఁ బాపవిధిం దలఁగంగవచ్చునే? 168

శ్లో. మాతులోయస్యగోవిందః పితాయస్యధనంజయః
సోఽభిమన్యు ర్గతప్రాణః కాలోహి దురతిక్రమః.

చ. జలజభవాండభాండమును జంపను, బెంపను, సృష్టిసేయనున్
జలము, బలంబుఁ జాతురికిఁజాలిన శౌరికినల్లువాఁడు, గా
ములదొరగెల్చినట్టి నరుముద్దుసుతుం డభిమన్యుఁడీల్గె బం
దెలఁబడి, కాలరీతి దురతిక్రమణీయ మదెట్టివారికిన్. 169

శ్లో. హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి
లలాటలిఖితారేఖా పరిమార్టుం నశక్యతే.

కం. హరియైనను, హరుఁడైనను
విరిదమ్మిఁ బొడమినట్టి వేలుపెయైనన్
సురలైన నసురలైనను
బరిమార్జనచేయలేరు ఫాలాక్షరముల్. 170

శ్లో. ఆయుః కర్మచ విత్తంచ విద్యా నిధనమేవచ
పంచైతాన్యపిసృజ్యంతే గర్భస్థస్యైవ దేహినః.

గీ. మనుజునకు నాయురుపలబ్ధి, మరణవిధముఁ
జేయఁబోయెడుకర్మ, మార్జించుధనము
నభ్యసించెడువిద్య యీయైదుగూడ
నజుఁడులిఖియించు గర్భస్థుఁడైనయపుడె. 171

శ్లో. అశ్వంనైవ గజంనైవ వ్యాఘ్రంనైవచ నైవచ
అజాపుత్రం బలిందద్యా ద్దేవో దుర్బలఘాతుకః.

కం. బలిఁగొనఁడు వారువంబును
బలిఁగొనఁడు గజమ్మునైన వ్యాఘ్రమునయినన్
బలిఁగొనును మేకపిల్లను
బలహీనులనే వధించుఁ బాపపువిధియున్. 172

శ్లో. ఖనంతు సప్తపాతాళం భ్రమన్త్వాకాశమండలే
ధావంతు సకలాంపృథ్వీం నాదత్తముపతిష్ఠతే.

గీ. త్రవ్వినను సప్తపాతాళతలముదాఁక
నెగిరినను మింటికొననంటు మొగులుదాఁక
పరుగులిడినను సకలభువనములదాఁక
పెట్టనిదె మానవునకెందుఁ బుట్టఁబోదు. 173

శ్లో. పితా రత్నాకరోయస్య లక్ష్మీర్యస్యసహోదరీ
శంఖో భిక్షాటనంకుర్యాత్ నాదత్తముపతిష్ఠతే.

గీ. తనకు రత్నాకరేంద్రుండు తండ్రియంట
భువనములతల్లి లక్ష్మి తోఁబుట్టువంట
సంకు భిక్షాటనంబును సల్పనయ్యొ
పెట్టనిదె యెట్టివారికిం బుట్టఁబోదు. 174

శ్లో. పౌలస్త్యః కథ మన్యదారహరణే దోషం నవిజ్ఞాతవా
నక్షైశ్చాపి యుధిష్ఠిరేణ రమతాజ్ఞాతో నదోషో నకిం
రామేణాపి వనే నహేమహరిణస్యాసంభవో లక్షితః
ప్రత్యాసన్నవిపత్తిమూఢమనసాం ప్రాయోమతిః క్షీయతే.

చ. ఎఱుఁగఁడెపాపమంచుఁ బెరయింతులకూటమి రావణాసురుం
డెఱుఁగఁడె జూదమెంతయును నెగ్గుఘటించునటంచు ధర్మజుం
డెఱుఁగఁడె పైఁడిలేడి జనియించుటయెట్లని రామభూవిభుం
డెఱుక సుబుద్ధికైన నశియింపదె యాపద దాపురింపఁగన్. 175

శ్లో. కర్తవ్యో హ్యాశ్రయః శ్రేయాన్ ఫలం భాగ్యానుసారతః
నీలకంఠగళస్థోపి వాసుకి ర్వాయుభక్షకః.

గీ. ఆశ్రయంబెంతగొప్పదై యమరియున్న
ఫలము భాగ్యానుసారమై పరఁగుచుండు
నీలకంఠుని కంఠాన నెగడఁగనియు
వాసుకియుఁ దాను గాలిమేపరియకాఁడె? 176

శ్లో. యాతః క్ష్మామఖిలాం ప్రదాయ హరయే పాతాళమూలం బలిః
సక్తుప్రస్థవిసర్జనా త్సచముని స్స్వర్గం సమారోపితః
ఆబాల్యా దసతీసతీ సురపురీం కుంతీసమారోహయత్
హా సీతా పతిదేవతాగమ దధో ధర్మస్య సూక్ష్మాగతిః.

ఉ. ఇంచుక పేలపిండితిననిచ్చినమానికి నబ్బెస్వర్గ, మా
ప్రాంచ దఖండరాజ్య మిడినట్టి బలీంద్రుఁ డధోగతిన్ గనెన్
గొంచెపుసాధ్వియై యెసఁగుకుంతి దివింగనె, సాధ్విసీత దుః
ఖించుచు భూమియందణఁగె; నెవ్వఁ డెఱుంగును ధర్మసూక్ష్మమున్.

శ్లో. కర్మణాబద్ధ్యతేబుద్ధి ర్నబుధ్యా కర్మబధ్యతే
సుబుద్ధిరపి యద్రామో హైమంహరిణ మన్వగాత్.

ఆ. వె. కర్మచేత బుద్ధి కట్టంగఁబడుఁగాని
బుద్ధిచేతఁ గర్మ బద్ధమగునె
బుద్ధిమంతుఁడైన పుణ్యుండురాముండు
పసిఁడిలేడివెంటఁ బరుగులిడఁడె? 178

శ్లో. నాకాలే మ్రియతేకశ్చిత్ విద్ధ శ్శరశతైరపి
స్పృష్టః కుశాగ్రమాత్రేణ ప్రాప్తకాలో నజీవతి.

గీ. వాడిశరముల వేయింట గాఁడిపడినఁ
గాలమరుదేరకుండినఁ గూలఁబోఁడు
దర్భకొన గ్రుచ్చుకొన్నమాత్రంబుచేతఁ
బ్రాప్తకాలుండు దాఁనిక బ్రతుకఁబోఁడు. 179

శ్లో. లోకఃపృచ్ఛతి సద్వార్తాం శరీరే కుశలంతవ
కుతః కుశలమస్మాక మాయుర్యాతి దినేదినే.

గీ. క్షేమమా నీకటంచుఁ బ్రశ్నించుచుందు
రెంత మందబుద్ధులోకదా యీజనమ్ము
ప్రాణి కేరీతిఁ గుశలంబు బరిఢవిల్లు
నహరహంబు నాయుర్దాయ మరుగుచుండ. 180

శ్లో. ఆదిత్యచంద్రావనిలోఽనలశ్చ ద్యౌర్భూమిరాపో హృదయంయమశ్చ
అహశ్చరాత్రిశ్చ ఉభేచసంధ్యే ధర్మశ్చజానాతి నరస్యవృత్తమ్.

చ. నరుఁడొనరించు కార్యముల నాకము, భూమియు, రెండుసంధ్యలున్
దరణియు, నోషధీశుఁడు, సదాగతియున్, యమధర్మరాజు, శం
బరమును, రేయియుంబవలుఁ బావకుఁడాత్మయు ధర్మమున్, నిరం
తరమునుజూచుచుందురు, వితంద్రత బత్తెములేనిసాక్షులై. 181

శ్లో. ఆదిత్యస్యోదయంజాతం తాంబూలం భారతీయవాక్
ఇష్టా భార్యా సుమిత్రంచ అపూర్వాణి దినేదినే.

కం. సారసమిత్రోదయమును
భారతసంశ్రవణ, మిష్టవనితాగోష్ఠుల్
సారపుఁ దాంబూలంబును
గూరిమిచెలికాఁడు నిచ్చ క్రొత్తలుసుమ్మీ! 182

శ్లో. కాకఃకృష్ణః పికఃకృష్ణః కోభేదః పికకాకయోః
ఆయాతే మధుయామిన్యః కాకఃకాకః పికఃపికః.

ఉ. కాకము నల్లనైతగుఁ బికంబును జూడఁగ నల్లనైతగున్
కాకపికంబులందున నొకానొకభేదము గల్గనేర్చునే?
ప్రాకటమైయెసంగు ఋతురాజము ప్రాప్తమయయ్యెనేని, య
క్కాకము కాకమేయగుఁ బికంబుఁ బికంబగుఁగాదె యారయన్.

శ్లో. శ్రుతిర్నష్టా స్మృతిర్నష్టా ప్రాయేణ పతితాద్విజాః
అంగానిచ విశీర్ణాని హావృద్ధో కలిర్వర్తతే.

చ. తొలఁగె శ్రుతిప్రభావమది, తూలె స్మృతివ్యవహారమెంతయున్
గలిగె ద్విజప్రకాండపతనమ్ము, ఘటిల్లెను వర్ణసంకరం
బెలమిఁదొఱంగి యంగతతులెంతయు శీర్ణతనొందెఁ జేష్టడెన్
కలివలె వృద్ధజీవి బహుకష్టపరంపరఁదోఁగి యక్కటా! 184

శ్లో. అశ్వః శస్త్రం శాస్త్రం వీణా వాణీ నరశ్చ నారీ
పురుషవిశేషం ప్రాప్తా భవంతియోగ్యా అయోగ్యాశ్చ.

కం. తురగము, శస్త్రము, శాస్త్రము
నరుఁడును, వాణియును, వీణ, నారీమణియున్
బోరిఁదముఁజేపట్టిన యా
నరు సామర్థ్యమునుబట్టి నడచుచునుండున్. 185

శ్లో. హేమ్నః ఛేదేన దాహేన ఛేదేన కషణేన చ
ఇదమేవ మహద్దుఃఖం యద్గుంజాసమతోలనమ్.

గీ. కాల్చి ఖండించి యొరపిడిఁగలుగఁజేసి
సుత్తితో మోదినను లేదు సుంతవగపు
తుదకు గురివెందగింజతోఁ దూలనుదూప
దుస్సహముగాదె? బంగారుతునక కకట! 186

శ్లో. అశ్వప్లుతం వాసవగర్జనంచ స్త్రీణాంచచిత్తం పురుషస్యభాగ్యం
అవర్షణంచాప్యతి వర్షణంచ దేవోనజానాతి కుతో మనుష్యాః.

గీ. వాసవునిగర్జ, శశ్వదశ్వప్లుతంబు
వారిజాక్షులజచిత్తంబు, వానరాక
పాతములపోక, మనుజులభాగ్యరేఖ
నెఱుఁగనేరరు దేవతాధీశులైన. 187

శ్లో. వనాని దహతో వహ్నేః సఖాభవతి మారుతః
సయేన దీపనాశాయ కృశే కస్యాస్తి సౌహృదమ్.

చ. అడవులఁగాల్చువేళ సఖుఁడై పవమానుఁడు కృష్ణవర్త్మకె
క్కుడుగనుసాయమై పెనుపుగూర్చును తద్దహనుండె దీపమై
యడరెడువేళ నందుఁగలయగ్ని నడంచును దత్సమీరుఁడే
కడుఁగడు సన్నగిల్లుతఱిఁ గానఁగవచ్చునె స్నేహభావముల్. 188

శ్లో. జలేతైలం ఖలేగుహ్యం పాత్రేదానం మనాగపి
ప్రాజ్ఞేశాస్త్రం స్వయంయాతి విస్తారంవస్తుశక్తితః.

చ. ఖలుచెవిఁబడ్డగోప్యమును, గంధినిఁజెందినతైలముం, సుధీ
తిలకున కీయఁబడ్డ సముదీరితశాస్త్రము, పాత్రదానముం
కొలఁదులెయయ్యు నెల్లెడ నకుంఠితరీతిఁ దమంతఁదామె, భూ
తలమున వ్యాప్తిఁజెందు నిదితథ్యము వస్తుబలానురూపతన్. 189

శ్లో. వ్యాలాశ్రితాపి విఫలాపి సకంటకాపి
వక్రాపి పంకిలభవాపి దురాసదాపి

గంధేన బంధురసి కేతకి సర్వజంతోః
ఏకోగుణఃఖలు నిహంతి సమ స్తదోషాన్.

చ. ఫలములు లేనిదయ్యు, ఘనపన్నగసంశ్రియమయ్యుఁ, బెల్లుపం
కిలభవమయ్యుఁ గంటకవికీర్ణమెయయ్యు, నగమ్యమయ్యు, వం
కలుగలదయ్యుఁ గేతకి యఖండసుగంధగుణైకకాంతమై
యలరు, గుణంబొకండు సకలావగుణమ్ములఁ గొట్టివైవదే! 190

శ్లో. విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమమ్
నహివంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్.

గీ. పృథుల విద్వజ్జనౌఘపరిశ్రమంబు
నెఱుఁగు విద్వాంసుఁడే, యన్యుఁ డేమియెఱుఁగు
ఘనతరంబగు ప్రసవవేదననొకింత
యెఱుఁగనేర్చునె? గొడ్డురాలెంచిచూడ. 191

శ్లో. కవితావనితాచైన స్వయమేవాగతా వరం
బలా దాకృష్యమాణాచే త్సరసా విరసాభవేత్.

క. కవితయు, వనితయు, బొంగుచుఁ
దవిలి తమంతటను దామె తారొక్కనిరా, మే
లవు బలిమినిలాగ, సరస
త విరిసిపోవంగ విరసతయె ఘటియిల్లున్. 192

శ్లో. అవ్యవస్థితచిత్తానాం ప్రసాదోపి భయంకరః
సువ్యవస్థితచిత్తానాం కోపోపి నభయంకరః.

గీ. అవ్యవస్థితచిత్తులైనట్టిజనుల
కరుణయుంగూడ భయమును గలుగఁజేయు
సువ్యవస్థితచిత్తులౌ సుజనవరుల
కోపమైనను భయముఁ జేకూర్పఁబోదు. 193

శ్లో. మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్
ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతి సపశ్యతి.

కం. పరకాంతలఁ దల్లులఁబలెఁ
బరధనముల వట్టిగడ్డిపరకయుఁ బోలెన్
బరులం దన్నటుచూచెడు
పురుషుఁడు తనయందె పరమపురుషునిఁ జూచున్. 194

శ్లో. బ్రహ్మఘ్నే చ సురాపేచ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితాలోకే కృతఘ్నే నాస్తి నిష్కృతిః.

గీ. బ్రహ్మహత్యకుఁ గలుదావ్రుపాపమునకు
దొంగవృత్తికి, సద్వ్రతభంగమునకుఁ
గలదు నిష్కృతి మఱిలేదు తలఁచిచూడఁ
గుటిలచారిత్రుఁడగు కృతఘ్నునకు నెందు. 195

శ్లో. స్వగృహే పూజ్యతేమూర్ఖః స్వగ్రామే పూజ్యతేప్రభుః
స్వదేశే పూజ్యతేరాజా విద్వాన్ సర్వత్రపూజ్యతే.

గీ. జడుడు పూజింపఁగాఁబడు స్వగృహమందె
ప్రభువు పూజింపఁబడును స్వగ్రామమందె
రాజు పూజింపఁబడు స్వరాష్ట్రంబునందె
సుకవి పూజింపఁబడు నెల్లచోటులందు. 196

శా. కట్టా! అన్నముఁబెట్టకున్న నసలే గాఱింతు, వింతెచ్చుగాఁ
బెట్టంగల్గినఁ జిక్కఁబెట్టి కరమున్ బీడింతు, వేసుంతయో
పెట్టన్ బిట్టును లోదహింపగ నత్యుత్తిన్ గొట్టు మిట్టాడుదో
పొట్టా! యెట్టు భరింపనేర్తుము? నినున్ బొమ్మెంతపాపిష్ఠివో! 197

కం. ఏనికి విద్యయుఁ దపమును
దానము, శీలంబు, గుణము, ధర్మము లఱుదో

యానరుఁడు ధరకు భరమై
మానుషపశువనఁగఁబరఁగు క్ష్మాతలమందున్, 198

ఉ. ఈవులమ్రానుగెల్చె, దిగధీశులలెంకలఁజేసె, మృత్యుదం
ష్ట్రావళు లూడఁదీసె, మిహికాచలమూఁచెఁ ద్రిశూలికై దశ
గ్రీవలనగ్ని వేల్చెఁ దుదికిన్ నరుచే, మడిసెన్ దశాస్యుఁ డ
ద్దైవబలంబు లేసియెడ దగ్ధము లెంతటిపౌరుషంబులున్. 199

చ. పిరిగొని గాలిపట్టుకొని పీల్చెడుఁగాయని భూతవైద్యుఁడున్
సొరిది గ్రహాలపాటనుచు జోసియు బల్ కఫవాతపిత్తసం
భరమని వైద్యనేతయును బల్కుదు రంతియకాని బిట్టు దు
ర్భరమగు కర్మహేతువని భావనసేయరు రోగభాజనున్. 200



# శృంగారలహరి

చ. అలకలు మోముఁదమ్మిపయి నల్లలనాడఁగ, ఘర్మవారి చె
క్కుల దిగజాఱ, నూర్పులకు గుబ్బలు పైకెగయంగ, వీడు, వే
నలి, యరమోడ్పుఁగన్నుల ననంగపరిశ్రమఁజొక్కియున్న య
క్కలికి మనోహరాకృతి, యఖండసుఖ మ్మొనఁగూర్చుఁగావుతన్. 1

అవతారిక:— నాయకుఁడు నాయికను బరిహాసము చేయుచున్నాఁడు.

చ. జలకములాడి, మేలుబురుసాపనిచీర ధరించి నీటుగాఁ
దిలకము దిద్ది సొమ్ములనుదీరిచి యద్దముఁజూచి దిద్దుకొం
చు లలితశయ్యఁ గుందములుజొబ్బిల దిక్కులుచూచుచుంటి వో
యలికులవేణి! యెవ్వనిఁ గృతార్థునిఁజేయఁగ నున్నదానవో? 2

అవ:— నాయకుఁడు మొండిపట్టుపట్టి పోవనుండ నాయిక రాత్రియను నెచ్చెలిని దీనయై ప్రార్థించుచున్నది.

ఉ. రాతిమనస్సువాఁ డతఁడు ప్రార్థనముల్ వినఁ డూరికేగు రే
పే, తగు నిండుజవ్వనపుటింతిని నన్నుఁబరిత్యజించి, నీ
వేతఱిఁ దెల్లవాఱక యిటే యెదుగుందలనందియుండు మో
రాతిరి నెచ్చెలీ! యతనిక్రౌర్యముఁ జూతముగాక పిమ్మటన్. 3

అవ:— నాయికోక్తి.

చ. మగఁడను నేను నీకనెడుమాట "చలామణి" చేయకుండ నె
వ్వగలును, గిన్కలున్, విసుఁగువర్తనలున్, నయగారమొప్పు మా
న్పఁగడఁగుచున్ విధేయులయి భామల కెక్కుడుప్రీతిపాత్రులై
తగుప్రియులే, ప్రియుల్, దలఁపఁ, దక్కినవారలు వట్టిభర్తలే! 4

అవ:— ముగ్ధానాయికనుగూర్చి దూతికపలుకుచున్నది.

చ. చెలువునిమాట వీనుఁగవఁ జేరుటయే తడవాయె, గగ్గుకుల్
మొలచెను మేనఁ; బాదములఁబుట్టెనసవ్వడి విన్నమాత్రమే

యలుక దొలంగిపోయె; దరియఁగ వడకొందెద; వింకనేమి కాఁ
గలవొకొ ? ముద్దరాల ! యతిగాఢముగాఁ బతిగౌఁగిలించినన్. 5

అవ:—ప్రణయిజనులను గూర్చిన నాయకోక్తి.

చ. కనులకుఁగూర్చునుత్సవ మెగాదిగఁ జూచుచునుందు మేని; నె
మ్మనమునకున్ ఘటించు నతిమాత్రపుఁదృప్తి దలంతు మేని; నె
క్కొని చెవికింపునింపుఁ బలుకుల్ వినఁగల్గుదు మేని; నద్దిరా !
ప్రణయిజన మ్మనారతము రమ్యతరమ్మయి క్రాలుచుండదే ? 6

అవ:—నాయిక దూతికతోఁ బలుకుచున్నది.

చ. అలుకను దెచ్చిపెట్టుకొని, హర్షమడంచుచు నాథుఁగాంచువే
ళల నిరుగేల లోచనములన్ రభసమ్మొసలార మూసికోఁ
గలుగుదుఁగాని, కాయమునఁ గాకరకాయవిధాన దట్టమై
పులకచయమ్ము లుప్పతిలఁబోలు నె మూసికొనంగ నంగనా ? 7

అవ:—వడివడిగాఁబోవు నాయికనుజూచి నాయకుఁడు పల్కుచున్నాఁడు.

చ. తరుణి ! మదుత్తరీయము నదాటునఁబట్టి యిదేమి యింతవే
గిరముగ నేగుచుంటి; వొకకీడు దలంపవు; మెల్లమెల్లఁగా
నరుగుము; లేకయుండినఁ గుచాద్రులవ్రేఁగున లేఁతకౌ నయో !
విఱుఁగునొయంచు నామనము వేదననందఁదొడంగె నెంతయున్. 8

అవ:—ప్రియుఁ డింటికే తేరఁ బ్రేమభరంబునఁ దిరస్కరించిన నాయికను వీడి యాతఁడు వెళ్లిపోవ నవ్వెనుకఁజింతిలు నాయికతోఁ జెలిపల్కుచున్నది.

ఉ. మాటికిఁ దియ్యతియ్యనగు మాటలుపల్కఁగఁ జేదుమాటలన్
బోటి ! బదుల్ వచించితివి; పొమ్మనిం ద్రోసితి కాళ్ళవ్రాలినన్;
ఘాటిలునల్కమై నతఁడు పాయక యేగెడువేళ నాపవై;
ఏటికి నేరికోస మిఁక నీపరితాపమునొందు టో చెలీ ! 9

అవ:—కవివాక్యము.

చ. తొలుతటికాన్పువేళ నొకతొయ్యలి వేదననందుచుండ, న
చ్చెలిచెలికత్తియల్ దరికిఁజేరి తదీశునిగాధఁ దివ్వఁ బే

రలుకను 'చాలుచాలు నిఁక నాతనిమాటల మానుఁ'డంచుఁ దాఁ
బలుకుచు నవ్వు డాసఖులఁ బక్కనవ్వాఁగఁ జేసె నెంతయున్. 10

అవ:—మితిమీటిన కోపముఁదాల్చిన నాయికనుగూర్చి నాయకుఁడు దూతితోఁ బలుకుచున్నాఁడు.

చ. ధరణితలాధినేతకు స్వతంత్రతయుంబలె శక్తిమంతుఁడౌ
నరునకు క్షాంతియట్లు, వదనంబునకున్ సరసోక్తిభంగి, సుం
దరులకుఁ గిన్కశోభిలుట తథ్యము దూతిక ! మేరమీఱుచోఁ
బోరి రసహీనమంచుఁ బువుఁబోఁడికి మెల్ల నెఱుంగఁజెప్పవే ! 11

అవ:—కవివాక్యము.

ఉ. ఒక్కటి మోమునందు, మరియొక్కటి కన్నుల, గుబ్బలందు వే
ఱొక్కటి, మోవియందు మఱియొక్క, టికొక్కటి చెక్కులందు ని
ట్లొక్కొక యంగకమ్మునకు నొక్కొకచూపునుబంపఁ జిక్క యం
దొక్కటియేని క్రమ్మఱిల; దుగ్మలిసోయగ మింద్రజాలమో ? 12

అవ:—చెలికత్తెబోధ ననుసరించి ప్రియునెడఁ గోపముఁదాల్పలేనిదై నాయిక చెలితోఁ జెప్పుచున్నది.

ఉ. "ఎప్పుడుఁ గోపమేయెఱుఁగ విట్లయినన్ మరి భర్త ప్రేము నే
చొప్పునఁ జూఱఁగొందు" వని, చొన్పితివాత్మను బల్మిమై; నికం
దప్పక కోపగింతునని ధైర్యముఁదాల్ప నతెండువచ్చెఁ; దా
నప్పుడ కోపమంతయును నబ్జముఖీ ! మటుమాయమయ్యెనే ! 13

అవ:—నాయిక చెలికత్తెతో ధన్యురాలివ త్తాంతముఁ జెప్పుచున్నది.

మ. "పరదేశంబుననుండి ప్రేమయుతుఁడై ప్రాణేశుఁ డేతెంచు-న
త్తటిఁ గోపింతునునేను-నన్నతఁడు నార్ద్రంబైనచిత్తంబుతో
దరికింజేరిచి యూరడించు"-ననుచున్ దర్పించి యుప్పొంగు న
త్తరుణీరత్న మొకర్తెయేసుమి చెలీ ! ధన్యాత్ములరా లెన్నఁగన్. 14

అవ:—అలంకరించుకొనుటతోఁ గాలయాపనముచేయు నాయికనుఁ జెలి బోధించుచున్నది.

చ. చెలియరో ! కాలయాపనముఁజేయుచునుంటివి స్వర్ణభూషణా
వళులను దాల్చువ్యాజమున; వస్తులు దైవమెఱుంగులెమ్ము; య

వ్వలపులకాఁక తగ్గునెడ వానిమనోధన మింక నాచికోఁ
గలవొకో ? వెఱ్ఱిదాన ! యపుగందగుఁజువ్వ ససంభ్రమంబునన్. 15

అవ:— నాయికానాయకుల విలాసకృత్యములుజూచి చేటికోకఁడు నుడువు చున్నాఁడు.

ఉ. లీల వసంతమైపరఁగి లేవలితాఁకుననూగు కల్పపూ
మాలికనుండిరాలిన దుమారము నుష్ణ్వన నూదుచోఁ గనుల్
బాలికమూసికో సొగసువాతెఱ తేనియఁ దృప్తిదీఱఁగాఁ
గ్రోలెదుభాగ్యశాలి ! సురకోటుల నీవెవరో వచింపుమా ! 16

అవ:— సాధ్వీచరితము—కవివాక్యము.

చ. పసువపుటిక్కయయ్యు, నిజభర్తదవీయుఁడెయయ్యు, లేవడిఁ
మఱుగునదయ్యుఁ, బొర్గు వెలనారులకుఁ నెలవయ్యు, నందమం
దఱుదయినట్టిదయ్యు, నిలయంబల రచ్చనునున్నదయ్యు, నా
సరసిరుహాక్షివృత్తి మొకచాయయుఁ గగ్గదదెంతసాధ్వియో ? 17

అవ:— ఆసఁగొల్పి ఫలశూన్యముగాఁజేసిన నాయికనుగూర్చి నాయకుఁ డనుచున్నాఁడు.

ఉ. లాలితమందహాస సువిలాసములం దిలకించి నన్ను నీ
వేలుకొనంగనేర్తు వనియెంచి సమీపముఁజేరుకొంటె, నీ
భ్రూలత లల్లలాడ్తు; ఫలముంజెయిచేర్చి సుఖంపనీవు; చా
ల్చాలు “సి కెండమూరి వ్యవసాయము లయ్యెగదే !” తలోదరీ! 18

అవ:— అల్కవహించినప్రియురాలితోఁ బ్రియుఁడు పలుకుచున్నాఁడు.

చ. ఇటులనె నిల్చియుండునొకో యెప్పుడు జాఱక జవ్వనంబు, మా
పటివలె రేపుగాదుసుమి ! భావికిలేదు ప్రమాణ; మెప్పుడో
చిటుకున రాలిపోవుఁగద ! చెన్నటిదేహము; మాని మాన మ
క్కటికమునూది యింక బిగికౌఁగిటఁ జేర్చి సుఖంపవేసఖీ ! 19

అవ:— నాయిక ప్రియునియందలి ప్రేమాతిశయము నుగ్గడించుచున్నది.

ఉ. వారును వారువారు మరివారునువారును వారువారు నే
పాఱఁగఁ బల్కుపల్కు లవియన్నియు నించుక మార్పులేక మా

వాదును బల్కువాడు తెలివా! యవి విన్నఁగొలంది తృప్తి దా
నీరిక లెత్తినట్టులయి యేనుఁగు నెక్కినచంద మయ్యెడిన్. 20

అవ:—నాయికానాయకుల పరస్పరసంభాషణము.

చ. "అలుకను మానవే చెలియ ?-యల్గినదెవ్వరు ?-నీవకావె?-నా
కలుకఘటిల్లునే యొరులయం-దొరులెవ్వరె యిందు ?-నాథ! మీ
రలెకద !-యేమె యట్లనెదు రాగిణి ?-నాదురదృష్టమోయి"- యి
ట్లలయక వాదులాడుకొను నా మిథునమ్మొనఁగూర్చు హర్షమున్.

అవ:—నాయకునిపైఁ గోపమువహింపుమని యుపదేశించిన చెలికత్తెకు నాయిక సమాధానముచెప్పుచున్నది.

చ. కనుఁగవమోడ్చితిన్ బ్రియుమొగం బెదురౌనెడ మోమువంచితిన్
వినఁబడకుండ మూసితిని వీనులు, డెందము రాయిచేసికొం
టిని, యిటులెన్ని చేసినను నెచ్చెలి! చెప్పఁగఁజాల నెందుచే
తనో? సరిక్రొత్తరెక బహుధాపిగిలెన్ మఱి యేమిసేయుదున్. 22

అవ:—రతిపారవశ్యమునుగూర్చి నాయిక చెలికత్తెతోఁ నుడువుచున్నది.

చ. అఱిముఱి నన్నుగూడుసమయంబున, జందెపుఁబోచ నాసికా
భరణమునందుఁ జిక్కుకొనఁ బక్కునలాగక మెల్లమెల్లఁగాఁ
దెరలిచి కోర్కెఁదీర్చుకొనెఁ దియ్యనిమాటల సందుసందునన్
బరవశనై యెఱుంగఁ బ్రియవల్లభుచేష్టిత మప్పుడో చెలీ! 23

అవ:—ప్రియునిదౌష్ట్యమునుగూర్చి నాయిక దూతికతోఁబల్కుచున్నది.

ఉ. చిక్కెడలింతు నన్నమిషచే వెనువెన్కకుఁ జేరి, చేతులన్
బ్రక్కలనుండి చొన్పి, బిగఁబట్టెఁగుచంబుల, వెన్కఁజూడఁగాఁ
గ్రక్కునమోవినొక్కె, నలుకన్ వెసఁజూడఁగఁ దళ్కుఁజెక్కులన్
బక్కునముద్దులాడె నటుపై మఱియేమొయెఱుంగ దూతికా! 24

అవ:—ఒకానొకకాంత యొకనాయకునియవస్థకు జాలిపడి వానితోఁ బల్కుచున్నది.

చ. కొఱకొఱచూచుచున్, గసరికొట్టుచుఁ రట్టొనరించుచున్, దిర
స్కరణముదోఁపఁ గాలఁ దొలఁగంగను దోయుచుఁ గాంత నిన్ రతిన్

దొరలుపఁజూచి మాకు మదినీరయిపోయె, మదుక్తి విన్మిదే
"గురువును నేను నీ" కనుచుఁ గోమలికిం జెవినూఁదు ముగ్ధుఁడా! 25

అవ:—కవివాక్యము.

ఉ. వారిరుహాక్షియై, మెఱుపువల్లరియై, మదనాగయానయై,
శ్రీరుచిరాంగియై, వలపుతేనిశిలీముఖయై, ప్రమోదముఁ
గూరుచు నింతిమోవి, గిలకొట్టినచో నమృతంబుపుట్టి, యే
పాఱునటం చెఱుంగు నెడ నబ్బుధు లంబుధిఁజిల్కియుందురే? 26

అవ:—కవివాక్యము.

చ. అవనతమౌ ముఖాబ్జముఁ గరాబ్జతలంబున సంఘటించి, నీ
వెవరిఁదలంతువే? జలరుహేక్షణ యంచుఁ బ్రియుండు వల్క నా
కెవరుగలా రటంచుఁ గుచవృంతముపైఁ గనునీరు జాఱ, నా
ప్రవిమలగాత్రి యేడ్చి, ప్రియు వశ్యునిఁ జేసికొనెక్ క్షణంబునన్. 27

అవ:—భర్తృసమాగమోత్కంఠనున్న నాయికచేష్టను కవి వర్ణించుచున్నాఁడు.

చ. పడఁతి ప్రియుండువచ్చునని వాకిటికింజని, తొంగిచూచి, బ
ల్విడిఁ జనుదెంచి, శయ్యఁబవళించి, కనుంగవమూసి, మంపుచే
నొడయనిఁగౌఁగిలించుకొను నుత్కలికన్ జెయిఁజాచి, ప్రక్కత
గ్గడ నెదఁగ్రుచ్చి, మేలుకొని, కాంచెను వెల్వెలపాటునయ్యెడన్. 28

అవ:—ఎడమకన్నదరుచున్న కాంత ప్రియసమాగమకాంక్షతోఁ బల్కుచున్నది.

చ. సలలితరీతి నిట్లదరసాగితివేలనె? నేఁడు దీనికిన్
ఫలముగ రాత్రికిం బ్రియుఁడు వారక తానిటువచ్చునేని, న
వ్వలపలికన్నుమూసి, నిను వామవిలోకమ! విప్పళించి, నా
చెలువునిచెల్వు చెల్వెసఁగఁ జెచ్చెర నీకిఁక విందొనర్చెదన్. 29

అవ:—దూతిక నాయకుని బెదరించుచున్నది.

ఉ. ఓ చతురుండ! నీకుమనసొక్కెడసిల్వఁగఁబోదు కైతవం
బా చిగిరించునిచ్చ, లభిమానముమిక్కిలి కంచుకాగడా
వైచినఁగాన మవ్వలపుఁబల్కులు, రోషముమెండు, ధూర్తుఁడా!
మా చెలిచేతిలోఁ బడితి, మానుమునీవిఁక వెఱ్ఱివేషముల్. 30

అవ:— నాయికతనవ్యథను చెలికిఁదెల్పుచున్నది.

గీ. "కాల మొకకొంత వ్యర్థమైకడచెఁ జెలియ !
చెప్ప కింతకాలంబు వంచించితేల ?"
యనుచుఁ జెలిపైని రుసరుసలాడుకొంచు
రతులకపుడప్డై మఱఁగిన రమణివలికె. 31

అవ:— నాయికయొక్క ప్రేమాతిశయమును దూతి నాయకునితో నుడువుచున్నది.

మ. సరసీజేక్షణ ప్రాణ మర్థమును, వంశఖ్యాతిలెక్కింప దే
గురువాక్యంబును బాఁటిసేయదు, భవద్గోష్ఠీప్రతిష్ఠామిళ
త్సరసాలాపకథాసుధారసము నాస్వాదించుటంజేసి, సుం
దరుఁడా ! నీపయి దానికెంతవలపో తర్కింపు నీవే యెదన్. 32

అవ:— దవ్వులనుండి సలుపు యువకదంపతుల విలాసచేష్టలను కవి వర్ణించుచున్నాఁడు.

మ. తలయూపం దలయూచు, మోవిపయికెత్తన్ మోవిఁబైకెత్తుఁ జిం
తిలఁ జింతించును, నవ్వ నవ్వును, బొమల్ దేలింపఁ దేలించు, బొ
మ్మలుఁగన్మూసినఁ గన్నుమూయు నిటుప్రేమస్ఫూర్తిఁ గ్రీడించి, ర
చ్చెలియుం జెల్వుఁడు, దవ్వుదవ్వులనె వాసిన్ నిల్చి, యన్యోన్యమున్.

అవ:— కాముకురాలగు నాయిక ముచ్చటను కవివర్ణించుచున్నాడు.

మ. "కొనగోళ్లిచ్చటఁబట్టి గ్రుచ్చె, నిచటం గ్రొమ్ముత్తెముంబోని, య
మ్మునిపంటం దగనొక్కినాఁడె, నిచటన్ ముద్రాంకముల్ గ్రుద్దెఁ గం
దెను గాత్రంబులటంచుఁ" గాంత పగలెంతేఁగుంది, చేరంగఁబో
యెను కేళీనిలయమ్ము మాపగుటకోనే బాధయేమయ్యెనో ? 34

అవ:— కవివాక్యము.

చ. పలుకులుసంభ్రమింప, నెఱవాఱిన యోష్ఠము సంచలింపఁ, గ
న్నులు గడుజేవురింప, బొమ నూల్కొని మిక్కిలితత్తరింపఁ, జె
క్కులు చెమరింప, దౌదవ్వులకుంజని "ముట్టకునాథ" యంచుఁ బే
రలుకనటించుచుండు హరిణాక్షి విధంబు స్మరింపనొప్పదే ! 35

అవ: — కవివాక్యము.

చ. నలకఁ దొలంగఁ జేయ, నయనంబును బ్రాముకొనంగఁ జూచి, నీ
కలుక మరేల యంచనిన నంగన యేడ్వఁ బ్రియుండుఁ గుందఁగన్
బిలిచినఁ బల్కఁగాదె కనుబొమలుబోంట్ల, కనంగుఁ డమ్ములన్
గెలుచువిధాన నశ్రువుల గెల్తురుగాదె ప్రియాళి నంగనల్. 36

అవ: — నాయికయొక్క సఖి సవతియొక్క సఖితోఁ బలుకుచున్నది.

చ. అలరులువాడకుండ, మణిహారము చిక్కులఁ బొందకుండఁగా
నలఁగకయుండ వల్వ, పతినర్మగృహంబుననుండి వచ్చు నె
చ్చెలినిఁ బ్రభాతమందుఁ గని చెందిరి హర్షము, డగ్గఱిల్ల, నా
దలపయిఁ గాంచి లత్తుకను, దానిసపత్నులు కందిరీసునన్. 37

అవ: — ప్రణయకోపముఁ దాల్చుచున్న నాయికతోఁ జెలి పలుకుచున్నది.

ఉ. పెట్టిదపూసపర్యకును బ్రీతి దొలంగకయుంట, క్షాంతి నే
పట్టున వీడకుంట, పతిపల్కును దాఁటకయుంట, సాధ్వికిన్
బెట్టనిసొమ్ములందు, రలపెంకెతనమ్మును, టక్కుటెక్కులున్
బిట్టుతొలంగు నల్కయును బెట్టినసొమ్ములొకొక్కవేళలన్. 38

అవ: — ఒకానొకఁ డొకయంగన నటించుగూను వర్ణించుచున్నాఁడు.

కం. బంగరుబొంగరములఁ బో
లంగల చనుదోయి మెక్కలమ్మగపడు నం
చుం గడుఁ దలవాల్చుచు న
య్యంగననటియించు గూను నదియుముదంబే ! 39

అవ: — కవివాక్యము.

గీ. నిస్తులోత్కర్షమున నొప్పు వస్తువులకుఁ
బేరులం గూడ నింపులై పెంపుగాంచు
ముద్దు, రతి, కౌఁగిలింతయు, మోహనాంగి
చందనము, చక్రవర్తియుఁ జంద్రుఁడనఁగ. 40

అవ:--- తెల్లవాఱి జాముప్రొద్దెక్కినను గదివీడిరాని నాయికను జెలు లుపాలంభించుచున్నారు.

ఉ. ప్రల్లదనానఁ బట్టి బలవంతముఁ జేసినఁగాని చెల్లరే!
వెళ్ళఁసిగ్గులాడి పతి వేశ్మము నుర్క విడనాడిరాదు, ప్రొ
ద్దల్లదె! బారెడెక్కినను నంచుఁ జెలుల్ గదిఁతల్పుచెంతఁ బే
రుల్లసమొప్పఁబల్క విని, యుగ్మలి సిగ్గిలె నిల్లువెల్వడన్. 41

అవ:— కులటాలక్షణము నొకచెలి మఱియొకచెలితోఁ బల్కుచున్నది.

చ. పనిగొని నాల్గునాళ్ళవలవచ్చెద నంచుఁ బ్రియుండుపల్కఁగా
దినమున కొక్కము, ద్దొక రతిక్రియ, యొక్కొక కౌఁగిలింతచొ
ప్పున నను దేల్చిపొమ్మనుచుఁ బొల్తి బలాత్కృతి చేయుచుండె, ల
జ్జనువిడనాడి యంబుదకచా! యది యెంతటిజంత యోకదే! 42

అవ:— తొల్లిఁటికన్న మిన్నయైన ప్రేమ నటించు నాయకునిఁగూర్చి మాతి నాయికతోఁ జెప్పుచున్నది.

చ. కుతుకముఁగూర్చు మచ్చికలుఁ గోరినకోర్కులు దీర్చివైచుటల్
ప్రితినలు, మన్ననల్, బహునిరంతరయానము, లాసఁజూపుటల్
వితతములయ్యె నీధవుని వెంబడిఁ దొల్లిఁటికన్న మిన్నలై
యతివినయంబు చంద్రసదృశానన! ధూర్తునిలక్షణంబగున్. 43

అవ:— పురమందేయుండి తనయింటికిరుదేరని నాయకునిఁగూర్చి నాయిక విచారించుచున్నది.

మ. పొరుగూరేగినప్రాణనాయకుఁడు రేపోమాపొ లోలేక్షణా!
యరుదేరంగలఁడన్న యాశను వియోగాంభోధి మున్ దాఁటితిన్
బురమందియ్యెడ నేవసింపఁ గనియుం బోరాములంజిక్క, నె
క్కరణిన్ నేనిపు డేమియాసగొని యిక్కాయంబుఁ గాపాడెదన్. 44

అవ:— నాయికావాక్యము.

గీ. అందమున మారుఁ డుపలబ్ధి నమరగురుఁడు
దానమున భానుసూనుఁడై తనరుచున్న
నచ్చు దందొక్కటేనియు, నా కతండు
మగఁడగుటచేతఁ గాఁబోలుఁ జిగురుఁబోఁడి! 45

అవ: —విప్రయోగి విచారము.

చ. చెలువునిపాదముల్ చిగురుఁజేతులఁ గోమలియొత్తుచుండ, న
చ్చెలువుఁడు దాని ముద్దుగొని, చెంతకుఁ బ్రేముడిఁ జేరఁదీసి, కౌ
గిలి సుఖమందుచుండఁగని, కీడ్పడి యొక్కవియోగి 'యీసుఖం
బొలయదుగాదెనా' కనుచునూర్చుచు, మ్రింగఁదొడంగెగుక్కలన్.

అవ: —కవివాక్యము.

ఉ. వానిదిభాగ్యవైభవము, వానిదిపుణ్యభరాత్తజన్మ, మ
వ్వానిది సంపదున్నతియు, వానిది నిస్తులభోగభాగ్య, మె
వ్వానిమనోజ్ఞతల్పమునఁ బంచశరాహవకేళిఁజొక్కి, యే
మానిని భావభూశిఖిలహార్యవిధంబునఁ బవ్వళించునో ? 47

అవ: —కళి నాత్మికయగు ప్రియురాలినిఁగూర్చి నాయకుఁడనుచున్నాఁడు.

చ. కనులుతొగల్, మొగంబు నవకంజము, మోవి కిసంబు, నున్నత
స్తనములు పూలబంతులు, భుజంబులు తామరతూండ్లు, నాభి పో
న్నననన, కరంబులబ్జములు, నాసికసంపెగ, యిట్టులన్ని మె
త్తనివిగఁజేసి, నీహృది విధాత వధూమణి ! రాయిచేసినే ! 48

అవ: —ఒకస్త్రీ తనప్రియుని వలపువెంపుఁ దెలుపుచున్నది.

చ. బగబగ మండఁబోదు, కొడినాఱదు మిక్కిలి యొత్తిగోసినన్
జిగిని దొలంగఁబో దెపుడు, స్నేహముఁదాహరియింప దింతయే
నెగదిగదీత లేదు, మఱియేయెడ నాఱదు, రత్నదీపమై
నెగడునుగాదె మత్ప్రియు ననిందితమూ వలపెప్పుడుం జెలీ ! 49

అవ: —కటికిదరిద్రుఁడైనవాని నేలవలచితివే యని యెగతాళిచేయుచున్న నాయికతో మరియొకతె పలుకుచున్నది.

చ. అటనట లోపముండిన నహా యనిపించదె గానవిద్య, య
క్కుటిలతచేతఁ జంద్రికళ గొల్పదునే తనరంజకత్వమున్
గటువగునొక్కొ యిక్షువునఁ గన్నులుగల్గినమాత్ర దూతికా !
కటికిదరిద్రుఁడేయయినఁ గాంతునిసోయగ మెందుఁబోవునే ! 50

అవ:—కవివాక్యము.

చ. ఘలుఘలుఘల్లుఘల్లురను కాంచనకంకణకింకిణీస్వరం
బులవెలయించు నీ కరవిభూతికి మైనుఱపందుచున్, నినున్
బలిమినిబట్టి లాగ, వసనంబు వెసన్ దిగజాఱ, సిగ్గునన్
గలిపి తొడందొడన్ మరుగుఁగప్పి కదించినసొంపు నెన్నెదన్. 51

అవ:— నాయకుఁడు నాయికతో సరసములాడుచున్నాఁడు.

చ. కొమరయియొప్పు నున్నతికిఁ గూడలిమై తగునట్టి నీనితం
బ మను మహీధరాగ్రతలిపై నధిరోహణ చేసినూతు నా
సమదగజేంద్రయాన ! విను సత్యముపల్కుట తప్ప దేసి స్వ
ర్గమునకు దానికంతరము గ్రాలుఁగదా యొకబెత్తెడంతయై. 52

అవ:—కవివాక్యము.

మ. పెలుచన్ బ్రోషితుఁడైననాథుఁ డపుడే విచ్చేయఁ దొల్కాటముల్
తెలియంగాఁ బడకుండసాగె, నవలన్ దీండ్రించె మల్కాటమిన్
వెలలంబాఱుట, లూర్పుఁబుచ్చుటలు, చేవ్రేతల్ పచారించుటల్
పొలయల్కల్ కసరించుటల్ కొసరుటల్ ప్రోఁద్రోచుటల్ కూడుటల్.

అవ:—కవివాక్యము.

చ. అలుకను మారుమోమిడినయాల్మగలన్ ద్రుటిలోన నేర్పుమైఁ
గలిపెడు తాపికాఁడవు, మొగంబునఁ జెక్కులఁ బెక్కునొక్కినన్
దెలియగనీకముంచెదవు తీపిని ముద్దను బ్రహ్మదేవుఁడా !
వలఁతితనంబుతో నిటులె వర్ధిలుమా ! యిక వేయియేండ్లకున్. 54

అవ:—కవివాక్యము.

చ. కొరలు రతిప్రబంధమునకున్ దగుపీఠిక, దండయాత్రకా
మరునిప్రచండభేరి, కుచమర్దననాటకనాందియై సతీ
పురుష నుతిప్రపాత్రమయి పొల్చెడు నోపరిరంభణక్రియా !
చిరముఁ జిరాయురున్నతులఁ జెంది సుఖంబుగ వర్ధిలంగదే ! 55

అవ:— పగలుముగ్ధవలెనుండి ప్రౌఢయగుకాంతనుగూర్చి కవివాక్యము.

చ. పలుకదుపల్కరించినను, బల్కినయే నెదురెత్తువేయ దె
వ్వాలనను వంచుఁగాని, తల పైకెపుడెత్తినజాడలేదు ము
గ్ధలకును ముగ్ధయై పగటఁగన్పడుచుండునుగాని రేయి న
న్నెలఁతవిలాసవైఖరు లనేకవిధంబులు భావరమ్యముల్. 56

అవ:— నాయికంగూర్చి నాయకుఁడు పల్కుచున్నాఁడు.

చ. బలిమినిబట్టినట్లు, తమిపైకొనఁ బాయక వేడినట్లు ము
ద్దులు ఘటియించినట్లు తులఁదూఁగుచు నుయ్యాలనూగినట్లు, వి
చ్చలవిడిఁ గూడినట్లు నినుజక్కిలిగింతలువెట్టినట్లు తొ
య్యలి ! కలగంటి వేగునెడ నాకల నిక్కముసేయఁగోరెదన్. 57

అవ:—కవివాక్యము.

ఉ. కోడలు విప్రలబ్ధ తనకుం బ్రణమిల్లగ నాపెచేతి మే
లైపడికడెంబుదోయి యిలపై దిగజాఱిపడంగఁ జూచుచున్
గోడటికంబుఁ బెట్టి ముకుకోఁతలుగోసెడు నత్తయయ్యు, నా
కోడలి నక్కునందిగిచి కుందుచు నేడ్వఁదొడంగె నెంతయున్. 58

అవ:—కవివాక్యము.

ఉ. ఆ మధువాతపోతముల, నా హరిచందనచర్చలం గరం
బా మిహికాంబుపూరముల, నా పువుఁదోటల వెట్టివాఁడ ! నీ
వేమిటికాశ్రయింతు విటులీ నెఱవేసవి తాపమార్పఁ ద
త్కోమలగాత్రి పీనకుచకోరకసీమను విశ్రమింపుమా ! 59

అవ:—కవివాక్యము.

గీ. సౌకుమార్యంబు నీమేనఁ బ్రాఁకులాడు
రంజకత్వంబు నీమోమునం జెలంగు
నమృతవాహిని నీమోవి నవతరించు
నీవు చంద్రున కేమౌదువే ? వెలంది. 60

అవ:—వైద్యునకును వానినివలచిన కాంతకును పరస్పరసంభాషణము.

చ. "తెవులనివార్త వచ్చెఁ బడఁతీ! యగుపింప దొకింతజబ్బు నీ"
"కవునవుఁ జేయిచూడ కిటులందురె?–" "యేమియులేదు చేతిలో–"
"దవిలె భవత్కరాంబుజము, తాపమడంగిన–" "దైనఁబోదు–"–"నీ
వవలకుఁబోదువా మరల వ్యాధి పయింబడుఁగాదె వైద్యుఁడా!" 61

అవ:—భర్త ప్రవాసమునకేగుతఱి దంపతుల వర్తనావిశేషము.

చ. మగువ కనుంగొలంకులను మాటికి మాటికిఁజిందు నశ్రువుల్;–
మగఁడు పటంబునందుడుచు;– మంచిదిపొమ్మనుఁ–బోవుఁ–గాంత వె
న్దగులుచు సాగనంపుఁ; బతి దానిని వెన్కకుసాగనంపు;– నె
మ్మి గలుగఁ బ్రొద్దుగ్రుంకెఁ బొలిమేర నె;–వారలె పుణ్యదంపతుల్. 62

అవ:—నాయిక మన్మథుని దూషించుచున్నది.

చ. కనులనుమూసినం దెఱవఁ గాంతుఁడు గన్నులఁగట్టినట్లుగం
గనుపడు, మారుమ్రోగు శ్రవణంబులయందుఁ దదీయవాక్కులే
తనువునకబ్బినట్లగును దాఁకుడుచేనగుహాయి, విఱ్ఱవీఁ
గ నగునె విప్రలంభ మెదఁ గల్గఁగఁజేసితివంచు మన్మథా! 63

అవ:—ఒకచెలి మరియొకచెలితో నాయికయొక్క ప్రౌఢచేష్టావిశేషమును జెప్పుచున్నది.

ఉ. కంటివె నెచ్చెలీ! కలువకంటి "దురంతము" కుక్కపిల్లకే
మంటకమిచ్చి నేర్పుమెయి మప్పెనొ మచ్చికఁజేసి; వచ్చెనా
యింటిమగండు 'భొంయి' మను నెంతయు, బైటిమగండువచ్చెనా
వెంట నెపోయి, నోర్వ్రేడలఁబెట్టుచు వాలముఁద్రిప్పఁజూచితే.! 64

అవ:—నాయికాముఖసౌందర్యము.

గీ. సూర్యుఁడుదయించుటాదిగాఁ జూచుచుంటిఁ
గాని భేదంబు నేనెఱుగంగనైతిఁ
"దురుద్ధతి"
నంబుజంబునకును భవదాస్యమునకుఁ
దెఱవ! చంద్రోదయంబొటఁ దెలిసెనిపుడు. 65

అవ:—కవివాక్యము.

మ పరదేశంబున కేగినట్టి పతిరాఁ బాలింఙ్గపొంగార, దాం
తరలై కోరికలూరఁ గేళివసతిం దాఁజేరి, యంతెంతకున్
మరలంబోని తదాప్తులన్ వెలువరింపంగోరుచున్, గుట్టె నే
పురుగోయంచును దీపమార్పెను వడిం బూఁబోఁడిపయ్యంటతోన్.66

అవ:—జోత్స్నాభిసారికనుగూర్చి చెలిపలుకుచున్నది.

చ. పరిపరి మేనఁ జందనముఁ బూమి, శిరంబునఁ బెల్లు మల్లెపూ
సరములు దాల్చి, తెల్లనగు సన్నదుకూలముగట్టి, నవ్వుదాం
తరలు రహిల్ల, వెన్నెలలు దట్టములై యిటుకాయుచుండఁగాఁ
జరచరఁబోవ నేల ? యభిసారిక ! నిన్ గురుతింపశక్యమే ? 67

అవ:—విటవేశ్యాసంభాషణము.

చ. వలపునఁ జెల్వుఁ డింపయినవల్వలు భూషలు వేశ్యకిచ్చి, య
వ్వలపువొలంగ "నానగలు, వల్వలు ని"మ్మని, రోసిపల్కఁగాఁ
"బలుమఱు మున్ను నేనిడిన బంగరుముద్దులుఁ గౌఁగిలింత లీ
వలఁ బడవేయరా" యనియెభామ, యతండు నిరుత్తరుండుగాన్. 68

అవ:—గాయకుఁడు గానమెక్కుడనియుఁ బండితుఁడు సాహిత్యమెక్కుడనియు వాదించుకోఁగాఁ బండితుఁడు గాయకున కిచ్చిన జవాబు.

మ. "సరవిన్ దక్షిణవామపార్శ్వకుచముల్ సంగీతసాహిత్యముల్
పరమేష్ఠీసతి" కంచు గాయకుఁ డనన్ బల్కెన్ సుధీంద్రుండిటుల్
మరిపట్టుంగద దక్షిణస్తనము వామంబైనహస్తంబునన్
బరగన్ వామకుచంబు దక్షిణకరాబ్జాతంబునన్ ధాతయున్. 69

అవ:—చెలి నాయికతో వలపుసంగతి వాకుచ్చుచున్నది.

కం. గురుతరమగు వలపుండిన
సరళతనేకాంచి గోతి జానగుచుండున్
మరి యదివిఱిగిన మొదలే
పరుషతగని తోఁచు నదియె పర్వేందుముఖీ ! 70

అవ:—వియోగంబునఁ గృశించిన నాయికంగూర్చి దూతిక నాయకుని నిందించుచున్నది.

చ. కటికివియోగవేదననుగ్రాగి మఱంగెడు నీలతాంగికిన్
జిటికెనవ్రేలియుంగరము చేతికిఁ గంకణమయ్యె, నవ్వలన్
బటుతరమైనయట్టి జపమాలగ మారినదోయి! యింక న
క్కటికముఁజూపకున్న నరకమ్మునఁగూలవె నిర్దయాత్ముఁడా! 71

అవ:—వలపుయొక్క వికారములను నాయిక నాయకునితోఁ జెప్పుచున్నది.

చ. వలపధికంబునీకు నలపైదలిపై; మరి నాకు నీపయిన్
వలపది మెండు; ప్రేమ నలపైదలి నీపయిఁ జూపదింతయున్
వలపులముల్లె యెప్పు డెడఁబాయని నాపయినీకులే, దహో!
వలపువికారముల్ బహుళభంగు లెఱుంగఁగనౌనె ధూర్తుఁడా! 72

అవ:—వియోగమున స్త్రీకి వెఱ్ఱిబాగరిచేష్ట.

చ. ఒకటియు రెండు మూడనుచు నోపికఁ జేతులవ్రేళులెల్ల లె
క్కకుఁగొని, యంతఁ బాదములఁగల్గిన వ్రేళుల నెంచియెంచి యం
తకును బ్రియుండు రామి, ఇఁకఁ దన్వికి లెక్కిడ వ్రేళ్ళులేమి, చూ
చుకములఁ గంటినీరుపడుచున్ వఱదంగొననేడ్చెఁ జెచ్చెఱన్. 73

అవ:—ప్రణయకోపముఁదాల్చిన నాయికంగని నాయకుఁడు పల్కుచున్నాఁడు.

గీ. ప్రణయకోపంబుపెంపునఁ బ్రబలుబిగువుఁ
గడలికొమ్మయుఁ, జెఱకు, నీకన్నుబొమయు
భంగములఁబొందుకోలఁది యోపంకజాక్షి!
రసమునొలికించుఁగాదె సంతసమెలర్ప. 74

అవ:—వలపుమాహాత్మ్యము.

చ. చెలువునిఁజూచుచోఁ గనులు చేరలమీఱుచు వీనుదాఁకెఁ, బూ
తలిమముఁజేర, గగ్గురులుదార్కొనె, నక్కునఁ జేర్పఁబోవుచోఁ
బలిమినిఁ బంటలాగినను బాయనినీవి తనంతజాఱెఁ, న
వ్వలపు ఘటిల్ల నొక్కమొగిఁ బాటిలకుండునె సర్వభద్రముల్. 75

అవ:—దంపతులు దా మాటఁకొనుపల్కుల నుదయమున నే గోరింక వచ్చినవారి కడ నేకరుపెట్ట నాయికలజ్జిలి చెలిపైఁ గోపగించుచున్నది.

శా. రాగోక్తుల్ దమి రాత్రి యాల్మగలకుం బ్రాప్తిల్ల నాలించి బ
ల్వ్యాగంజొచ్చె హితాప్తబాంధవులమ్రోలం దెల్లవారంగ, శ
య్యాగారాంతికపంజరాంతరమునం దౌరౌర ! పల్గాకియా
నీ గోర్వంక నిదేలయుంచితివె బోటీ ! దవ్వులందుంచవే ! 76

అవ:—చెలికత్తె నాయిక నుపాలంభన చేయుచున్నది.

ఉ. ఇంతమొగంబుచేసికొని యేదియొ బొట్టనవ్రేల నేల నీ
కాంతుఁడు రాయఁజొచ్చెఁ జెలికత్తెలు ఖిన్నతఁగాంచి; రట్టె యా
చెంతనిలంబడెన్ హరిణి; చిల్కలుపిల్చినఁ బల్కకుండెఁ; గ
న్గాంతవిలోచనా ! విడువుమల్క నిక్కైననుఁ బున్నమయ్యెడున్. 77

అవ:—కుచపతనమ్మునఁగుందు నాయికను నాయకుఁ డూరడించుచున్నాఁడు.

చ. కలికి గులాబిజాతులకుఁ గంటకబాధ ఘటిల్లకుండ, న
బ్బలితపుఁ జన్ను లింతులకుఁ బ్రాయముమళ్ళిన వాలకుండ, నే
సలుపకపోదు నే చెలువ ! సర్వము సృష్టియొనర్పఁజాలు న
న్నలువకుఁగల్గు ప్రాభవమునన్ లవమైనను నాకుఁగల్గినన్. 78

అవ:—కవివాక్యము.

ఉ. పల్లవకోటి యల్లలన పాదసరోజము లాశ్రయించు, ను
త్ఫుల్లసరోజనేత్రి కటిఁబొల్చెడు వేణినిగాంచి తోడనే
తల్లడపాటునన్ ఘనవితానము నీరయిపోవు; భూమిభృ
త్తల్లజకోటి గుబ్బలకు దాస్యమొనర్చెడుఁ జూచితే సఖా ! 79

అవ:—కవివాక్యము.

చ. సురతతి కావుకావుమనుచున్ మొఱవెట్టుకొనన్ హలాహలం
బురవడి మ్రింగినాఁడ వది యుగ్రతఁ గాల్పఁదొడంగ నీరమున్
శిరమునఁ దాల్చితీవు శివ ! శీతశిలోచ్చయపుత్రికామనో
హార విమలోష్ఠసంభవ మహామృత మానక యెంతవెఱ్ఱివో ! 80

అవ: —కవివాక్యము.

చ. సరవి సుమాస్త్రమాత పురుషాయితకేళి కుపక్రమించి, యు
మ్మరరిపునాభిపద్మమునఁ బొల్పెసలారుచునున్నయట్టి దే
వర నల నల్వనుంగని యవారితలజ్జఁ గలంగి నేర్పుమైఁ
గరమున నాపె శౌరి కుడికంటిని మూసె నదేమిచిత్రమో ? 81

అవ: —ప్రియుఁడు ప్రవాసమునుండి రాఁగాఁ బ్రియురాలికిం గలిగిన సంతోష చిహ్నలను గవి వర్ణించుచున్నాఁడు.

సీ. కట్టెఁ దోరణమాలఁ గలువచాలునఁగాదు
కమనీయ దృగ్విభాకలనఁగాని
చల్లెఁ బుష్పశ్రేణి మల్లెమొల్లలఁగాదు
లలిత మందస్మితంబుల నె కాని
ఘటియించె నర్ఘ్యంబుఁ గలశోదకములఁగా
దూటించు కుచకుంభయుగళిఁగాని
అర్పించె నివ్వాళి కర్పూరమునఁగాదు
భవ్య దేహప్రభాపటలిఁగాని
గీ. కళల వెదచల్లు స్త్రీయాంగకములతోడ
నన్య దేశాంతరాగతుండైన రమణుఁ
డింటికే తేర నిట్లు లయ్యింతిసలిపెఁ
జారుతర మంగళాచార గౌరవంబు. 82

అవ: —కవివాక్యము.

చ. అరఁటినిఁబుల్చి నాళసహితాంబుజ, మందుఁబరుండెఁ జంద్రుఁడ
య్యెరవున నొప్పుకల్వల దినేశజపుట్టిన, దద్ది మేరుభూ
ధరశిఖరంబులందు శతథాపడి చొచ్చె నభోంగణంబుఁ ద
చ్చరితముఁజూడ మాకును వెసన్ ధృతిదూలి కలంగెస్వాంతముల్. 83

అవ: —చెలి వశుఁడైన నాయకునిపై నలుకవహింపవలదని నాయికకుఁ జెప్పు చున్నది.

చ. చిరవిరహార్తుఁడై ప్రియుఁడు చిత్తరువందు నితంబినీ ! నినుఁ
స్ఫురితపటీరపంకమునఁ బొల్పుగవ్రాసి పవర్గుచెక్కులన్

బరఁగ తవర్గమోవిని, టవర్గ పదమ్ములవాఁసె నింక నా
సరసునిపైనిఁ బేరలుక చాన! వహించుట పాడియౌనటే! 84

అవ:—కవివాక్యము.

ఉ. అక్షయసౌఖ్యదంబనుచు నందెటనో కలదంచు దానినిన్
మోక్షమటందురంచుఁ బలునోళులఁబల్కిరి తాము పండితా
ధ్యక్షులుమున్ను వారలటులాడిన మోక్షము నీవిమోక్షమే
యీక్షితి దానిమించి కలదే మఱి వేఱొకమోక్ష మెద్దియున్. 85

అవ:— ఒకకాంతసోయగమును గాంచి మైమఱచిన మానినిఁగూర్చి చెలి నాయికతోఁ బల్కుచున్నది.

ఉ. ఓచెలి! చూచితే! యనలిగొజ్జున సంధ్యనువార్చుచున్నాని, యే
ణీచపలాక్షి సౌరునకు నెట్టన తెల్వినిగోలుపోయి, తా
నాచమనంబు ముత్తడవలారసి చేతకుమారు మూడునూ
ర్లాచరణంబొనర్చె; మునులైనను జిక్కరె పూవుఁబోఁట్లకున్. 86

అవ:—వియోగావస్థనున్న నాయికనుగూర్చి సఖి పలుకుచున్నది.

కం. తెఱవా! తెలియకయడిగెద
నెఱేఁగింపవె యాడువారి కెం దధికంబౌ
విరహంబగు నెడ గాజులు
పెరిగి తమంతటను దామె పెద్దవియగునే! 87

అవ:——నాయికనుగూర్చి యామెచెలికత్తె పల్కుచున్నది.

ఉ. వారికివారి కిష్టమగువారలు మిక్కిలి పీడగూర్చినన్
గూరిమినోర్చి సౌఖ్యములకుం గురియౌదురుగాదె భర్తృవి
స్ఫార నఖక్షతమ్ములను సైపఁగ నేర్చిన పువ్వుఁబోఁడి వ
క్షోరుహపాళి యెంతయు గగుర్పునుజెంది సుఖింపదే సఖి! 88

అవ:——నాయకుఁ డొకదృశ్యమునుగూర్చి చెలికానితోఁ బలుకుచున్నాఁడు.

ఉ. పండుగనాట నొక్కవరవర్ణిని పిండినిగొట్ట, దానిపా
లిండులు పిండిరాలుటను నింపగు హంసలజంటయోయనం

పాండురకాంతులొప్పఁ గనుపండువు చేసినచొప్పు నెమ్మదిన్
మెండుగ నాటిపోయి కలనేనియు నన్విడకుండు నెచ్చెలీ! 89

అవ:—కవివాక్యము.

చ. తలఁపులచూలిబాణ మనఁదగ్గ తెలుంగువెలందియోర్తు, క
న్నులతలినుండి, పట్టురవికం దొలగించి జలానముంచి చ
న్నులవ్యథపెట్టినందుకు నినుం బరిపీడయొనర్తునంచు, నా
శిలపయి మోద, నర్తనము సేయఁదొడంగెఁ గుచంబు లింపునన్. 90

అవ:—చంద్రగ్రహణమునాఁడు గుమ్మమువెలుపల నిలఁబడిన కాంతను జూచి నాయకుఁ డనుచున్నాఁడు.

మ. సకియా! శీఘ్రము పోయి దాఁగుకొనుమా! సద్మంబునన్, రాత్రితే
నికిఁ బట్టున్ గ్రహణం బటంచుఁ దెలిసెన్ నే దాఁగుటేలందువా?
సకలంకంబగు చంద్రబింబమును బ్రిజ్జన్ వీడి స్వర్భానుఁ డ
య్యకలంకంబగు నీముఖంబు నిదె యాహారించు నొక్కుమ్మడిన్. 91

అవ:—కవివాక్యము.

చ. పడఁతిపదాంబుజంబులను వ్రాలుచు వేడెడు భర్తవీపుపై
బుడుతఁడు వ్రాలి, నవ్వొలయ, ముద్దులుగుల్కుచునుండ నెంతకున్
విడుమరఁ గాంచకున్న చెలిపేరలుకప్పుడె జాఱిపోవ, వే
పొడమెను మందహాసములమొల్కలు తద్వదనేందుమండలిన్. 92

అవ:—మారువేషముననున్న ప్రియురాలికిఁ బ్రియునకు జరిగిన సంభాషణము.

చ. 'పదరుచు నెందుఁ బోయెదవు?'—'వైద్యునియింటి'—'కదేల'—మాన్ప నం
గదలను—సర్వరోగములఁ గవ్వెడు నీప్రియయింట లేదె? పా
పదె కుచకుంభమర్దనము వాతము, వాతెఱ తేనె పైత్యమున్
మదవతితోడి క్రీడ పరిమార్పదె పూర్తిగ శ్లేష్మరోగమున్. 93

అవ:—ప్రియ్యుఁనూదు కాంతతోఁ గాంతుఁ డనుచున్నాఁడు.

ఉ. అండజయాన! నీవు శ్రమమందుచు నుష్ణ్వనూఁదుచుండినన్
మండక హవ్యవాహనుఁడు మాటికిఁ బ్రొయ్యని ధూమకాండమున్

మెండుగఁ గుండలించుఁజుమి మేలగు నీయధరంపుటూరుపుం
బిండుల కమ్మతావులకు బిట్టు మఱంగినవాఁడొకో యనన్. 94

అవ:—చెలికత్తె నాయికచేష్టను దెల్పుచున్నది.

చ. చెలియరొ ! నమ్మరాదునినుఁ జెప్పెడుమాటకుఁ జేయుచేఁతకున్
గలదు సహస్రమంతరము, నాథునిమాటలు గిట్టవందువా
చెలువుఁడువచ్చెనా మొగముచేరెడు, కన్నను జేరెడయ్యెడున్
జలజము సూర్యదర్శనమునం గడువిస్తృతిఁ జెందుచాడ్పునన్. 95

అవ:—నాయిక తనయవస్థను చెలితోఁ జెప్పుచున్నది.

చ. గిరగిరతిర్గుబొంగరము కేవలమున్ నరజీవితంబు, మ
ద్వరుసవియోగ మగ్నివలెఁబైకొని రేఁబవ లేర్చుచుంట నో
తరుణి తనుద్యుతుల్ వడలెఁ దప్పెఁజుమీస్పృహా, యింక నీవపో
శరణమునాకు మత్ప్రియుసిసన్నిధి నేమివచింతువోకదే ! 96

అవ:—వలపుచిచ్చువైఖరిని సఖి నాయికతోఁ జెప్పుచున్నది.

చ. మరిమరి యేర్చుచున్ సరసమానససీమల భగ్గుభగ్గునన్
దరికొనుచుంటకున్ బదులు తద్విరసాత్మలనాఱిపోవుచున్
జిఱచిఱలాడు నవ్వలపుఁజిచ్చువిధానము తల్లక్రిందులై
వరలునుగాదె లోకమునఁ బంకరుహాయతచారులోచనా ! 97

అవ:—నాయిక నాయకునితోఁ బలుకుచున్నది.

చ. అదయుఁడ ! కౌఁగిలించునెడ నవ్వలివోమిడి పవ్వళించి, నా
హృదయము బగ్గుబగ్గుమననేర్చితి వయ్యది చాలకిప్డు, నే
నొదుగుచు మార్గ్మగంబుసిడియుండఁగ గాటపువేడియూర్పులన్
వదలుచు వీపుగాల్చెదవు నాకవకాశము రాకయుండునే ? 98

అవ:—ధూమమునుజూచి భ్రాంతిచేఁ దల్లడిల్లు నాయికనుగూర్చి చెలి పలుకుచున్నది.

ఉ. బాధితనాపరాద్ధ వనపాదపజాలములై, పరీవృత
ధ్మాధర శృంగవీథులయి మండు దవాగ్నులఁబుట్టిక్రమ్మ, గా

ఘైధితధూమమండములియ్యవితొయ్యలి ! కానికావు ధా
రాధరమండలమ్ములివి రాయిడిఁజెందక యూరడిల్లుమా ! 99

అవ:—గోపిక తనచెలికత్తెతోఁ బలుకుచున్నది.

కం. పీవరమై కర్కశమై
తావత్కమునై వెలుంగు త్వత్ పృథుల కుచ
గ్రావము లెత్తిన శౌరికి
గోవర్ధన మెత్తుటొక్క గొప్పయె చెలియా ! 100

అవ:—కవివాక్యము.

చ. పురుషుల మేలిచూపుల సమూహము లోహశలాకఁజేసి యా
తనుపుల గుబ్బదోయిని విధాతృఁడు కాంతపుగుం డ్లొనర్చె, న
క్కరణియెకానిచో నితరగాత్రము లెన్నియొయుండఁ గొమ్ములుం
దిరిగినవారలున్ జనులనిక్కనకుం బడిపోవనేటికిన్. 101



# వైరాగ్యలహరి



శ్లో. పఠన్తు శాస్త్రాణి యజన్తు దేవాన్
కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః
ఆత్మైక్యబోధేన వినావిముక్తి
ర్నసిద్ధ్యతి బ్రహ్మశతాన్తరేఽపి.

మ. కలశాస్త్రమ్ములనెల్ల నేర్చినను, యజ్ఞశ్రేణులం జేసినన్
బలుకర్మంబు లొనర్చినన్, సురలఁ గొల్వంగాంచినంగూడ, ని
మ్ములఁ దత్త్వైక్యవిబోధనమ్మునవినా, మోక్షంబ దెవ్వారికిన్
గలుగన్నేరదు; నూఱు కల్పములకైనంగూడ నిక్కమ్ముగన్. 1

అవ:— మోక్షమునకు సులభమైనయుపాయమును జెప్పుచున్నాఁడు.

శ్లో. అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్
సంన్యస్త బాహ్యార్థసుఖస్పృహః సన్
సంతం మహాంతం సముపేత్య దేశికం
తేనోపదిష్టార్థసమాహితాత్మా.

మ. అరయం బండితుఁడైనసజ్జనుఁడు, బాహ్యార్థైక సౌఖ్యస్పృహో
విరతుండై, యతులప్రభావగరిమ న్వెల్గొందుసిద్ధాత్ము స
ద్గురుసేవించి, యచంచలుండయి, తదస్తోకోపదిష్టార్థ వి
స్ఫురితుండై పొనరింపనొప్పు జతనంబున్; ముక్తిసాధింపఁగన్. 2

అవ:— సంసారముమీఁది భ్రాంతి బాగుగా విచారణచేయుటవలన దొలఁగునని సోదాహరణముగా వివరించుచున్నాఁడు.

శ్లో. సమ్యగ్విచారతః సిద్ధా రజ్జుతత్త్వావధారణా
భ్రాన్త్యోదిత మహాసర్ప భయదుఃఖవినాశనీ.

గీ. త్రాటినింగాంచి యద్ది సర్పంబటంచు
భావనముఁ జేసికొనుటచేఁ బరఁగుభయము
తలఁగు; నది త్రాడనెడు యథార్థమ్మునెఱుఁగ
నెసఁగు సువిచారణమున నియ్యెఱుక భువిని. 3

ఆవ:—శమాదిలక్షణములను వివరించుచున్నాఁడు.

శ్లో. బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యేవంరూపో వినిశ్చయః
సోఽయం నిత్యానిత్యవస్తువివేకః సముదాహృతః.

కం. శస్తముగ, బ్రహ్మసత్యము
వ్యస్తముగ జగమ్ముమిథ్య యనునిశ్చయమే
సిస్తుగ నిత్యానిత్యపు
వస్తువివేకంబటంచు వాకొండ్రు బుధుల్. 4

శ్లో. తద్వైరాగ్యం జిహాసా యా దర్శనశ్రవణాదిభిః
దేహాది బ్రహ్మపర్యన్తే హ్యానిత్యే భోగ్యవస్తుని.

గీ. అరయఁ దనువాది బ్రహ్మపర్యంత మెసఁగు
నఖిలభోగ్యవస్తువు లనిత్యంబులనుచుఁ
బరఁగగుర్తించి యవ్వానిపట్ల నెపుడు
రతిని వీడ్కొనియుంట వైరాగ్యమండ్రు. 5

శ్లో. విరజ్య విషయవ్రాతా ద్దోషదృష్ట్యా ముహుర్ముహుః
స్వలక్ష్యే నియతావస్థా మనసః శమ ఉచ్యతే.

గీ. విషయములు భూరిదోషైకవేశ్మము లని
సారె గుర్తించుకొని స్వలక్ష్యంబునందె
సరవి నిలుపంగఁబడు మానసప్రవృత్తి
శమమటంచును వాకొండ్రు శాస్త్రవిదులు. 6

శ్లో. విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోళకే
ఉభయేషా మింద్రియాణాం సదమః పరికీర్తితః.

గీ. జ్ఞానకర్మేంద్రియంబులఁ గలితరీతి
విషయవృత్తులనుండి తప్పించి వాని
స్వీయగోళంబులందు నిల్పికొనఁగంట
దమమటందురు; బ్రహ్మవిత్తములు పేర్మి. 7

అవ:—భక్తియే మోక్షసాధనోపాయములలోఁ బ్రధానమైనదని నిరూపించు చున్నాఁడు.

శ్లో. మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే.

గీ. జంతుకోటికి ముక్తికోసంగు సాధ
నంబులను భక్తియొకఁడె శ్రేష్ఠంబటంచ్రు
పరిత్యగాత్మ కభిన్నమా బ్రహ్మమందు
భావసంధానమే భక్తినా వెలుఁగు. 8

అవ:—శ్రద్ధాభక్తిధ్యానయోగములు ముక్తికారణములని వివరించుచున్నాఁడు.

శ్లో. శ్రద్ధాభక్తిధ్యానయోగా న్ముముక్షో
ర్ముక్తే ర్హేతూన్వక్తి సాక్షాచ్ఛ్రుతేర్గీః
యో వా ఏతే ష్వేవ తిష్ఠత్యముష్య
మోక్షోఽవిద్యాకల్పితా ద్దేహబంధనాత్.

మ. కలితశ్రద్ధయు, భక్తి, ధ్యానమును, యోగస్ఫూర్తియుఁ జంతుసం
తతులకుఁ మోక్షమునిచ్చు హేతులనుచుఁ ఘోషించు వేదోక్తి; ని
చ్చలు నీనాల్గిఁట నిల్చువాఁడె కనుమోక్షశ్రీని; మాయామహా
బలసంప్రాప్త శరీరబంధమును ద్రెంపన్నేర్చు ధీరాత్ముఁడై. 9

శ్లో. ఋణమోచనకర్తారః పితుః సన్తి సుతాదయః
బంధమోచనకర్తాతు స్వస్మా దన్యో నకశ్చన.

గీ. తండ్రిఋణమును దీర్పంగఁ దగినవార
లుగ్విఁ దనయాదులగు బంధు లుండవచ్చుఁ
గాని భవబంధమును ద్రెంపఁగలుగువారు
తనకుమించి మఱెవ్వారు తలఁచిచూడ. 10

శ్లో. మస్తకన్యస్తభారాదే ర్దుఃఖ మన్యైర్నివార్యతే
క్షుధాదికృతదుఃఖంతు వినాస్వేన న కేనచిత్.

గీ. నెత్తిపై బఱువుమోయుట న్నిగడునట్టి
దుఃఖ మన్యులు తొలఁపనేర్తురు కడంగి
క్షుత్పిపాసాదులను గల్గుక్షోభమింక
స్వయముగాఁదానె యెడపికోవలయుఁ గాదె? 11

శ్లో. పథ్య మౌషధసేవాచ క్రియతే యేనరోగిణా
ఆరోగ్యసిద్ధి ర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా.

గీ. స్వయముగా నౌషధముగొని పథ్యసేవ
చేయురోగికి నారోగ్యసిద్ధిగల్గు
నన్యు లాపని చేయంగ నైరయేని
చేకుఱునె వాని కారోగ్యసిద్ధి యింక!

శ్లో. వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా
స్వేనైవ వేద్యం నతుపండితేన
చంద్రస్వరూపం నిజచక్షుషైవ
జ్ఞాతవ్య మన్యై రవగమ్యతే కిమ్.

ఉ. జాగ్రదఖండబోధమయ చక్షునఁ దానె కడంగి బ్రహ్మత
త్వగ్రహణమ్ముసేయ నుచితంబగుఁగాని, కళాభ్యుపాసనో
దగ్రత నద్దిఁబొప్పడదు; తాను స్వదృష్టినిఁజూడఁ జంద్రమో
విగ్రహముం గనుంగొనఁగ వీలగుఁగాని మఱొంటశక్యమే? 12

శ్లో. అవిద్యా కామకర్మాది పాశబంధం విమోచితుమ్
కః శక్నుయాద్వినాత్మానం కల్పకోటిశతైరపి.

గీ. మాయచేతను గామ్యకర్మములచేతఁ
బ్రాప్తమైనట్టి భవపాశబంధనమును
త్రెంపినైవంగఁ దానె నేర్చెడునుగాని
పరులునేర్తురె కోటికల్పములకైన. 13

శ్లో. యఏషు మూఢా విషయేషుబద్ధా
రాగోరుపాశేన సుదుర్దమేన

ఆయాన్తి నిర్యాన్త్యథ ఊర్ధ్వముచ్చైః
స్వకర్మదూతేన జవేననీతాః.

ఉ. కొ్రిచ్చి పెనంచుకొన్న యనురాగపురజ్జులఁ ద్రెంపలేక, లు
వ్యచ్చరితౌచితీవికలులై, విషయాహ్వాయబందిఁగూళ్ళ, క
ర్మోచ్చయనామకాతి కఠినోగ్రభటాగ్రణి తోందరింపుచే
వచ్చుచుఁబోవుచుండెదరు; వారక క్రిందికి మీఁదికిన్ జడుల్. 14

శ్లో. శబ్దాదిభిః పంచభిరేవ పంచ
పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః
కురంగ మాతంగ పతంగ మీన
భృంగా నరః పంచభిరంచితః కిమ్.

ఉ. మేదురరక్తి, నిల్చి, కరి, మిడ్తయు, మీనముఁ, దేఁటి దొట్రి, యీ
యైదును శబ్దముఖ్యవిషయావళిలోన, నొకొక్కదానియం
దే, దవులొంది చచ్చు; నిఁక నియ్యయిదింటనుగూడ నిత్య మ
త్యాదరవర్తనాకలితుఁడౌ నరుఁగూర్చి వచింపనేటికిన్. 15

శ్లో. దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి
విషంనిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షుషాప్యయం.

గీ. విషయమది తాను హానిగావించుపట్లఁ
ద్రాచు విషమునకన్న బల్దారుణమ్ము
విషము భోక్తనె హరియించు; విషయమన్న
ద్రష్టయగువానినింగూడ నష్టపఱచు. 16

శ్లో. విషయాఖ్యగ్రహో యేన సువిరక్త్యసినా హతః
సగచ్ఛతి భవాంభోధేః పారంప్రత్యూహవర్జితః.

గీ. శ్లాఘ్య వైరాగ్య చంద్రహాసమున నెవఁడు
దుష్ట విషయగ్రహంబును ద్రుంపఁగనునో
చేరునాతండె విఘ్నంబుఁజెందకుండ
ఘోరసంసారసాగర పారభువిని. 17

అవ:—స్థూలశరీరమును నిందించుచున్నాఁడు.

శ్లో. త్వఙ్మాంసరుధిరస్నాయు మేదో మజ్జాస్థిసంకులమ్
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నింద్య మిదంవపుః.

ఉ. వేలకొలంది స్నాయువులుఁ బెద్దయురక్తము, భూరిమాంసముల్,
జాలినమజ్జ, సాంద్రమగుచర్మము, దట్టపుఁగ్రొవ్వుముద్దలున్ ,
బోలెడు నెమ్ములుంగలిగి, మూత్రపురీషపుఁగొంపయైన యీ
స్థూలశరీర మెంతయును దూష్యముగాదె తలంచిచూడఁగన్. 18

శ్లో. విషయాణామానుకూల్యే సుఖదుఃఖవిపర్యయే
సుఖందుఃఖంచ తద్ధర్మః సదానందస్య నాత్మనః.

గీ. సరవి విషయమ్ము లనుకూలసరణిఁ జనిన
మోద, మటుగానియెడ దుఃఖమును ఘటిల్లు
నంతరింద్రియధర్మమ్ము లవ్వి ముట్ట
వమలమగు సదానందరూపాత్మ నెపుడు. 19

అవ:—అజ్ఞానమును పోగొట్టుకొనుటకు సోదాహరణముగా నొకయుపాయమును జెప్పుచున్నాఁడు.

శ్లో. శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ
స్సర్పభ్రమో రజ్జువివేకతో యథా
రజస్తమః సత్త్వమితి ప్రసిద్ధా
గుణా స్తదీయాః ప్రథితాః స్వకార్యైః.

చ. సరవి రజస్తమంబులును, సత్త్వమునన్న గుణత్రయంబుచేఁ
బరఁగు నవిద్యమూలమునఁ బాటిలునప్రతిబంధకమ్ము బం
ధుర పరశుద్ధ తత్త్వరసతుందిలబోధముచేత మాయమై
తెరలి నశించుఁ; ద్రాడ నెడు తెల్వి నహిభ్రమ మాయుచాడ్పునన్.

అవ:—అవిద్యావిభాగమును నిరూపించుచు నందలి విక్షేపశక్తిని వివరించుచున్నాఁడు.

శ్లో. విక్షేపశక్తీ రజసః క్రియాత్మికా
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ

రాగాదయోఽస్యాః ప్రభవంతి నిత్యం
దుఃఖాదయో యే మనసో వికారాః.

ఉ. ఏపగు రాగదుఃఖముఖ హేయగుణావళికెల్ల నిత్యముం
గాపురమై, యనాదియయి క్రాలెడుసృష్టికి బీజమై, క్రియా
రూపమునన్ రజస్సునకు రూఢిగఁ బుట్టువుగాంచె నెద్ది; వి
క్షేపకశక్తి, దీనిఁ దొలఁగించినఁగాక విముక్తిగల్గునే? 21

శ్లో. కామక్రోధో లోభ దంభాభ్యసూయాఽ
హంకారేర్ష్యా మత్సరాద్యాస్తు ఘోరాః
ధర్మాఏ తే రాజసాః పుంప్రవృత్తి
ర్యస్మాదేత త్ప్రదజోబంధహేతుః.

ఉ. కామము, క్రోధలోభములు, గాటపుదంభ, మసూయ, మత్స, రే
ర్ష్యా, మమకారముల్, దలఁప రాజసధర్మము; లివ్వి ఘోరతా
ధామములై ప్రవృత్తికి నిదానములౌటను జేసి యమ్మహో
భీమరజోగుణమ్మునకుఁ బెద్దయు దవ్వులనిత్రు ధీనిధుల్. 22

శ్లో. అజ్ఞానమాలస్య జడత్వ నిద్రా
ప్రమాదమూఢత్వ ముఖా స్తమోగుణాః
ఏతైఃప్రయుక్తో నహి వేత్తి కించి
న్నిద్రాలువత్ స్తంభవదేవ తిష్ఠతి.

మ. అలసత్వంబు, జడత్వ, మజ్ఞతయు, నిద్రాధిక్యముల్, మూఢ్యముల్,
బలవన్మత్తత; దొట్టియీగుణము లెన్నం దామసంబుల్ సుమీ;
గళితప్రజ్ఞత, నెద్దియేని దెలియంగాలేఁడు దానీ గుణం
బులకుం దావగువాఁడు; నిద్రితుఁడనన్ ప్రమోదోయనం దోచుచున్.

శ్లో. మాయామాయాకార్యం సర్వం మహదాది దేహపర్యంతమ్
అసదిద మనాత్మకం త్వంవిద్ధి మరుమరీచికాకల్పమ్.

గీ. అరయ మహదాది దేహపర్యంతమైన
జగముసర్వము మాయచే సంభవించి
యాత్మకన్నఁ బరమ్ము మిథ్యయునునగుచు
మరుమరీచికరీతి సంభ్రాంతిగొలుపు. 24

అవ:—ఆత్మషడ్భావవికారములు లేనిదని చెప్పుచున్నాఁడు.

శ్లో. నజాయతే నోమ్రియతే నవర్ధతే
నక్షీయతే నోవికరోతి నిత్యః
విలీయమానేఽపి వపుష్యముష్మిన్
నలీయతే కుంభ ఇవాంబరం స్వయమ్.

చ. జననము, సంప్రవర్ధనము, సంక్షయమున్, మరణమ్ము, నెన్నఁడుం
గనక, వికారభాజనముగాక, పరాత్మ, వినిత్యమై, కడుం
దనరుచునిల్చి, యీతనువు నాశముగన్నను, దాను కుంభమం
దెనయు నభమ్ముచందమున నెట్టివినాశములేక యొప్పెడున్. 25

అవ:— సంసారబంధహేతునిరూపణము.

శ్లో. అతాత్మన్యాత్మ న్యహమితిమతి ర్బంధఏషోఽస్యపుంసః
ప్రాప్తోఽజ్ఞానా జ్జననమరణక్లేశసంపాతహేతుః
యేనైవాయం వపురిద మస త్సత్యమిత్యాత్మబుద్ధ్యా
పుష్య త్యుక్ష త్యవతి విషయై స్తన్తుభిః కోశకృద్వత్.

చ. తనువెప రాత్మయన్న మతిఁదత్పురుఁడై నరుఁ, డజ్ఞతావశ
మ్మున విషయాళిఁజిక్కి సతమున్ దనువున్ దిరమంచునెంచుచున్
బెనుచుచుఁ గాచికొంచు, భవమృత్యుకరంబగుబంధమున్ దనం
తన మఱితానె కూర్చికొను; దట్టపుగూటిని లూతయుంబలెన్. 26

శ్లో. అఖండనిత్యాద్వయబోధశక్త్యా
స్ఫురంత మాత్మాన మనంతవైభవమ్
సమావృణో త్యావృతిశక్తి రేషా
తమోమయీ రాహురివార్కబింబమ్.

చ. నిరత మనంత మద్వయము నిర్మలమైతగు బోధవైభవ
స్ఫురణ నెలర్ప భవ్య శతసూర్యసమప్రభ లెల్ల దిక్కులన్
గిఱికొనవెల్గు సత్యమయునిన్ బరమాత్ముఁ దమోమయోద్భటా
వరణపుశక్తి గ్రమ్ముకొనుఁ; బంకరుహాప్తుని రాహుకైవడిన్. 27

శ్లో. మహామోహగ్రాహగ్రసనగలితాత్మావగమనో
ధియో నానావస్థాం స్వయమభినయం స్తద్గుణతయా
అపారేసంసారే విషయవిషపూరే జలనిధౌ
నిఏ జ్యోత్స్నజ్జ్యాయం భ్రమతికుమతిః కుత్సితగతిః.

మ. ఘనమాయామకరమ్ముచేతఁ బరమజ్ఞానంబు మాయంగ బో
రన పేరార్తి నటించి, దుర్విషయ దుర్వారిపూర మేపార, నెం
దు, నపారంబయిపోచు సంసరణపాథోరాశిమధ్యంబునం
దు, నరుం డేపఱి,మున్గి తేలి గతిహీనుండై భ్రమించున్ గడున్. 28

శ్లో. భానుప్రభాసంజనితాభ్రపంక్తి
ర్భానుం తిరోధాయ విజృంభతే యథా
ఆత్మోదితాహంకృతి రాత్మతత్త్వం
తథా తిరోధాయ విజృంభతే స్వయమ్.

ఉ. భానుమహాప్రతాప పృథువైభవసంపదచేత సంభవం
బైన ఘనాఘవప్రకర, మర్కుని మాటొనరించి, యెల్లెడం
దానగులీల, నాత్మవలనంబ్రభవించిన యయ్యహంత పెం
పూని, తదాత్మ,నోలమునమించు చెలంగు; నవార్యవైఖరిన్. 29

శ్లో. కబళితదిననాథే దుర్దినే సాంద్రమేఘై
ర్వ్యథయతి హిమఝంఝూవాయు రుగ్రో యథైతాన్
అవిరతతమసాత్మన్యావృతే మూఢబుద్ధిం
క్షపయతిబహుదుఃఖై స్తీవ్రవిక్షేపశక్తిః.

చ. ఘనఘనమండలీపిహితకంజహితంబగు నొక్కదుర్దినం
బున, హిమభీష్మవాయుచయముల్ చెలరేగి, జగమ్ము నొంచుచా
డ్పునఁ గలగించి, మూఘు, వెతముంచుఁ, గ్రియాకృతియా రజోగుణం
బనిశ మవిద్య పేర్చి వెసనాత్మనుజుట్టి యడంచి వైవఁగన్. 30

అవ:—సంసారమనునది యొక మహావృక్షమని చెప్పుచున్నాఁడు

శ్లో. బీజం సంసృతిభూమిజస్యతు తమో దేహాత్మధీరం కురో
రాగః పల్లవ మంబుకర్మతు వపుః స్కంధోఽసవః శాఖకాః
అగ్రాణీంద్రియసంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖంఫలం
నానాకర్మసముద్భవం బహువిధంభోక్తాత్ర జీవఃఖగః.

సీ. భూరి మాయారాశి పొలుపైన బీజంబు,
పాప్రక్తనకర్మంబు వారిధార,
తనువె నెమ్మినినాత్మయనుబుద్ధి కొమ్మొల్క
బహుళానురాగంబు, పల్లవంబు
బలితంపు దేహంబు, ప్రాకటంబగుస్కంధ,
ముసురు మొత్తంబు శాఖోత్కరంబు
సకలేంద్రియంబులు సాంద్రోపశాఖలు,
విషయమ్ము లిరవొందు విరులగములు

గీ. పలు తెఱంగుల కర్మలం బ్రభవమంది
క్రమ్మకొనిమ్ముట్టు బహుళదుఃఖంబు ఫలము
జీవుఁ డనుభోక్తయగు పక్షియై వెలుంగు
విపులసంసారమను మహావృక్షమునకు. 31

శ్లో. ఆనందమూల గుణపల్లవ తత్త్వశాఖా
వేదాంతపుష్ప ఫలమోక్ష రసాదిపూర్ణమ్
చేతోవిహంగ హరితుంగతరుం విహాయ
సంసార శుష్కవిటపే వద కిం రతోఽసి.

మ. అతులానందము వేగు, తత్త్వము సముద్యచ్ఛాఖ సాద్గుణ్యసం
గతి లేయాకు, త్రియీశిఖల్ విరులు, మోక్షశ్రీ ఫలశ్రేణిగా,
స్తుతులంగాంచు హరిద్రుమంబువిడి, మత్తుంజెంది, సంసారశు
ష్క తరుంజేరితివేమి మానసవిహంగంబా! వెఱంగయ్యెడున్. 32

శ్లో. అజ్ఞానమూలోఽయ మనాత్మబంధో
నైసర్గికోఽనాది రనంత ఈరితః
జన్మాప్యయ వ్యాధిజరాదిదుఃఖ
ప్రవాహపాతం జనయత్యముష్య॥

మ. ప్రకటవ్యాధి జరాదిదుఃఖముల నాపాదించి వేధించు పు
ట్టుకకుం గారణమై, నిసర్గమయి, టూటోలై, యనంతంబునై,
వికలంబై, ప్రబలాజ్ఞతాగరిమ నావిర్భూతిమహా, నీయనా
త్మకబంధంబును, ద్రొల్తు దెంపవలె; నుద్యన్ముక్తిసంప్రాప్తికై. 33

శ్లో. నాస్త్రై ర్న శస్త్రై రనిలేన వహ్నినా
ఛేత్తుంనశక్యో నచ కర్మకోటిభిః
వివేకవిజ్ఞానమహాసినావినా
ధాతుః ప్రసాదేన సితేన మఞ్జునా.

చ. కఱకగు నస్త్రశస్త్రములఁగాని, మహానిలశక్తిఁగాని, భీ
కరబృహదగ్నిఁగాని, బహుకర్మలఁగాని, నశింపదద్ది, యీ
శ్వరగవర సుప్రసాదమునఁ బాటిలునట్టి వివేకవిజ్ఞతా
భరమను శాతఖడ్గమునఁ బాయకత్రెళ్ళు; నిమేషమాత్రిలోన్. 34

శ్లో. శ్రుతిప్రమాణైకమతేః స్వధర్మ
నిష్ఠాతయై వాత్మవిశుద్ధిరస్య
విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం
తేనైవ సంసారసమూలనాశః.

చ. అలశ్రుతులేప్రమాణమని యాదృతి నమ్మికఁగొన్నవానికే
కలుగు స్వధర్మనిష్ఠ; మఱికల్గునుదాన మనోవిశుద్ధి; య

ద్విలసితశుద్ధిమూలమున వేగమ యప్పరమాత్మతత్త్వముం
దెలియుట కల్గు; దాన భువిఁ దెల్లు భవాగము మూలనాశమై. 35

శ్లో. త్వఙ్మాంసమేదోఽస్థి పురీషరాశా
వహంమతిం మూఢజనః కరోతి
విలక్షణం వేత్తి విచారశీలో
నిజస్వరూపం పరమార్థభూతమ్.

గీ. అమిత మలభారగృహము, శల్యములప్రోవు,
మలిన, మతికశ్మలము, మాంసమయము నైన
యీశరీరము, దానాత్మ మెట్టులగును?
వేత్తయైయొప్పు నయ్యాత్మ వేఱుసుమ్ము. 36

శ్లో. దేహోఽహ మిత్యేవ జడస్యబుద్ధి
ర్దేహేచ జీవే విదుషస్త్వహం ధీః
వివేకవిజ్ఞానవతో మహాత్మనో
బ్రహ్మాహమిత్యేవ మతిః సదాత్మని.

గీ. తనువె నేనంచు మూర్ఖుండు దలఁచుచుండు
బుధుఁడు జీవుండె నేనంచు బుద్ధి నెంచు
బహుళవిజ్ఞాన సువివేకవంతుఁ డెపుడు
బ్రహ్మనే నేననెడుబుద్ధిఁ బరఁగుచుండు. 37

శ్లో. పంచేంద్రియైః పంచభిరేవ హోతృభిః
ప్రచీయమానో విషయాజ్యధారయా
జాజ్వల్యమానో బహువాసనేంధనై
ర్మనోమయాగ్ని ర్దహతిప్రపంచమ్.

చ. విడువక యింద్రియంబులనుపేరిటి యేవురుహోత, లొక్కటం
గడఁగి, చిరత్నవాసన లనంబడు నింధనరాశి వైచి, వే
ల్మిడి విషయాజ్యధారలను మిక్కిలి వ్రేల్వ, మనోమయానలం
బడరి, ప్రచండమై, జగమునంతయుఁ గాల్చును; దుర్నివారమై. 38

శ్లో. నహ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా
మనోహ్యవిద్యా భవబంధహేతుః
తస్మిన్వినష్టే సకలం వినష్టం
విజృంభితేఽస్మి న్సకలం విజృంభతే.

గీ. ఉండదు మనస్సుకంటె వేఱొం, డవిద్య
యదియ భవబంధకారణం బగు, నవిద్య
యది నశించిన నశియించు నఖిలమపుడె
యదియ రేఁగినఁ జెలరేఁగు నఖిలమొకట. 39

శ్లో. వాయునాఽఽనీయతే మేఘః పునస్తేనైవ నీయతే
మనసాకల్ప్యతేబంధో మోక్ష స్తేనైవకల్ప్యతే.

గీ. గాలి కొనివచ్చుఁజుమ్ము మేఘమును దానె
దానినద్దియె క్రమ్మఱం దవులఁద్రోయు;
మనమెకల్పించుఁ దొలుత బంధనము నెందుఁ
గలుగఁగాఁజేయు; నదియె; మోక్షమును బిదప. 40

శ్లో. దేహాదిసర్వవిషయే పరికల్ప్యరాగం
బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన
వైరస్యమత్ర విషవత్సు విధాయపశ్చా
దేనంవిమోచయతి తన్మనఏవబంధాత్.

చ. కలవిషయమ్ములందు, నవగాఢపురాగము సంఘటించి, యా
బలితపుఁద్రాట గొడ్డునటు పాయకకట్టు మనంబు పూరుషుం
దలకొని యామనంబె తదనంతరమందు విషంబునం దటుల్
వెలపరముల్ఘటించి వెడలించుఁ దదుద్ధురబంధముం దుదిన్. 41

శ్లో. తస్మా న్మనః కారణ మస్యజంతో
ర్బంధస్య మోక్షస్యచవా విధానే
బంధస్యహేతు ర్మలినం రజోగుణై
ర్మోక్షస్య శుద్ధం విరజస్తమస్కమ్.

జంతుకోటికి బంధమోక్షములఁగూర్చు
నట్టిదా మానసముసూవె; యది రజోగు
ణమ్ముతోఁగూడి, కూర్చు బంధమ్ము దాను
ముక్తినొసఁగు రజస్తమమ్ములకుఁ దొలఁగి. 42

శ్లో. మనోనామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు
చరత్యత్ర నగచ్ఛన్తు సాధవో యే ముముక్షవః.

గీ. విషయచయమను ఘోరాటవిని సతమ్ము
మనమనెడు గండుబెబ్బులి మసలుచుండుఁ
జొఱకయుందురుగాత మచ్చోటఁ దాము
మోక్షమున కాసపడు సాధుపురుషు లెపుడు. 43

శ్లో. అనువ్రజ చ్చిత్ప్రతిబింబశక్తి
ర్విజ్ఞానసంజ్ఞః ప్రకృతేర్వికారః
జ్ఞానక్రియావా నహమి త్యజస్రం
దేహేంద్రియాదిష్వభిమన్యతే భృశమ్.

ఉ. పూనిక జాగ్రదాదులను బొల్చెడు చిత్ప్రతిబింబశక్తి, వి
జ్ఞానమయాఖ్యకోశమయి, శాశ్వతవస్తువికారమై, సదా
జ్ఞానమునుం, గ్రియాభికలనమ్మును, మేనను, నింద్రియాళి, నెం
తే, నభిమానముంగలిగి, నేననుబుద్ధిఁ జరించునిచ్చలున్. 44

శ్లో. అనాదికాలోఽయ మహం స్వభావో
జీవః సమస్తవ్యవహారవోఢా
కరోతి కర్మాణ్యనుపూర్వవాసనః
పుణ్యాన్యపుణ్యాన్యపి తత్ఫలాని.

ఉ. జీవుఁ డితం డహంకరణశీలముఁ జెందుచు, నాదిహీనుఁడై
తా వెలుగొందనేర్చి, వివిధవ్యవహారగణైకదక్షుఁడై
భావుకకర్మలున్ మఱియుఁ బాపపుఁగర్మము లాచరించువాఁ
డై, వెసఁ దత్ఫలానుభవమందుచు నుండు నిరంతరమ్ముగన్. 45

శ్లో. భుఙ్క్తే విచిత్రాస్వపి యోనిషు వ్రజ
న్నాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేషః
అస్యైవ విజ్ఞానమయస్య జాగ్ర
త్స్వప్నాద్యవస్థా సుఖదుఃఖభోగః.

చ. అలయక పెక్కు కీటకమృగాదికయోనులయందుఁ బుట్టుచుం
దలకొని యీ వివేకమయనామకకోశము జాగ్రదాద్యవ
స్థలను సుఖార్తులంగనుచు జాగ్రదుపజ్ఞకు బాహ్యమైన సదా
సలుపుచునుండుఁ జైనమును; సారెకుఁ గ్రిందికిమీఁదికిన్ దగన్. 46

శ్లో. స్వయం పరిచ్ఛేదముపేత్య బుద్ధే
స్తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః
సర్వాత్మకఃసన్నపి వీక్షతే స్వయం
స్వతః పృథక్త్వేన మృదోఘటానివ.

చ. వెలుపలలోపలన్ సకలవిశ్వమునందును నిండియుండఁగాఁ
గలిగినవాఁడయ్యుఁ గడుగాటముగాఁగ, ననాత్మ నాత్మగాఁ
దలఁచుటనో; తదాత్మ తనుదా నటువేఱయి, కుండ మట్టికి
న్వేలి యనునట్లు, తన్నుఁ దనుజీవుఁడెప్పుడున్. 47

శ్లో. ఉపాధిసంబంధవశా త్పరాత్మా
ప్యుపాధిధర్మా ననుభాతి తద్గుణః
అయోవికారా నవికారవహ్నివ
త్సదైకరూపోఽపి పరః స్వభావాత్.

చ. తలఁప నుపాధిసంగతిని దాను పరాత్మ యుపాధిధర్మ సం
కలితుఁడయై మెలంగు మఱి కన్గొనఁ నెప్పుడు నొక్కరూపమే
గలిగి వికారహీనుఁడయి కాలిలు కృశానుఁడు, తప్తహా నయ
స్సాలయు సమస్తరూపముల నొక్కటఁ దానును బొందుకైవడిన్.48

శ్లో. భ్రాన్తింవినా త్వసంగస్య నిష్క్రియస్యనిరాకృతేః
నఘటేతార్థసంబంధో నభసో నీలతాదివత్.

గీ. నీలతాదిగుణంబులు నింగినట్లు
విషయజాలము లంటవు విగతసంగు
డక్రియుఁడునైన యప్పరమాత్మునెపుడు
నంటుననుటది విభ్రాంతియగును జూవె. 49

శ్లో. జలంపంకవదస్పష్టం పంకాపాయే జలంస్ఫుటమ్
యథాభాతి తథాత్మాపి దోషాభావే స్ఫుటప్రభః.

గీ. బురదగలిసిననీరమ్ము స్ఫుటముగాదు
బురదయెడలిన స్ఫుటమౌచుఁ బొలుచునద్ది
యట్లె పరమాత్ముఁడును, మాయనంటనపుడు
నిరుపమానప్రభాస్ఫూర్తి నెగడుచుండు. 50

అవ:—చిదాభాసుఁడుకూడ ననాత్మయేయని సోదాహరణముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. ఘటోదకే బింబితమర్కబింబ
మాలోక్య మూఢో రవిమేవ మన్యతే
తథా చిదాభాస ముపాధిసంస్థం
భ్రాన్త్యాహ మిత్యేవ జడోఽభిమన్యతే.

చ. కలశజలాంతరాళమునఁ గానఁగవచ్చు దినేశుబింబముల్
దలకొనిచూచి మూఢుఁడలదాని, నినుండని యెంచుచాడ్పునన్
బెలుచ, నుపాధియుక్తమయి వెల్గెడు చిత్ప్రతిబింబశక్తినే
బలితపుభ్రాంతిఁ దన్నుగనె భావనసేయుజడాత్ముఁ డిమ్ములన్. 51

శ్లో. ఘటంజలం తద్గతమర్కబింబమ్
విహాయసర్వం దివి వీక్ష్యతేఽర్కః
తటస్థఏతత్త్రితయావభాసకః
స్వయంప్రకాశో విదుషా యథాతథా.

చ. కలశమునుంజలమ్ము నటగానఁగవచ్చు దినేశుబింబముల్
దలఁగి సుధీంద్రుఁ డాకసమునం గననేర్చు స్వయంప్రకాశుఁడై

వెలుఁగుచు నీత్రియంబునకు వెల్గొనఁగూర్చుచుఁ దాను భిన్నతా
కలన వహించి మించి కడుఁగ్రాలు యథార్థదినేశబింబముల్. 52

శ్లో. నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మ
మంతర్బహిఃశూన్య మనన్యమాత్మనః
విజ్ఞాయ సమ్యఙ్నిజరూపమేత
త్పుమాన్విపాప్మా విరజా విమృత్యుః.

ఉ. నిత్యు, ననంతు, సర్వగతు, నిర్మలు, సూక్ష్ము, నఖండబోధసం
గత్యుపశోభితుం, బరుఁ బ్రకాశకు, నీశుఁ, బరాత్ము, సన్ముని
స్తుత్యు, నెఱుంగఁగన్న సుకృతుల్ దురితమ్ములఁద్రోసి ధీరతన్
మృత్యువుఁ బాసి, శాశ్వతసుఖైకపదంబున నిల్తురిమ్ములన్. 53

శ్లో. బ్రహ్మైవేదం విశ్వమిత్యేవవాణీ
శ్రౌతీబ్రూతేఽథర్వనిష్ఠా వరిష్ఠా
తస్మాత్సర్వం బ్రహ్మమాత్రంహి విశ్వం
నాధిష్ఠానాత్ భిన్నతారోపితస్య.

గీ. ఈజగంబు బ్రహ్మంబె యౌననుచుఁ దెల్పు
నల యథర్వనైగమామలోక్తి
కారణమునకంటెఁ గార్యంబు వేఱౌనె
కాన సన్మయంబె కద! జగంబు. 54

శ్లో. సత్యంయదిస్యా జ్జగదేత దాత్మనోఽ
నంతత్వహాని ర్నిగమాప్రమాణతా
అసత్యవాదిత్వ మపీశితుః స్యా
న్నైతత్రయం సాధుహితం మహాత్మనామ్.

ఉ. ఎన్నఁగ నీజగంబె నిజమేని పరాత్ము ననంతతాబ్రథా
భ్యున్నతికిం బరేశుప్రతిబోధనకున్, శ్రుతికున్నకీర్తికిన్
బన్నముసంఘటిల్లు మఱి పావనమానసులౌ మహాత్మసం
పన్నులు సైపనేర రొకపాటియు నీత్రివిధంపుబన్నముల్. 55

శ్లో. ఐక్యం తయో ర్లక్షితయో ర్నవాచ్యయో
ర్నిగద్యతే౽ న్యోన్యవిరుద్ధధర్మిణోః
ఖద్యోతభాన్వోరివ రాజభృత్యయోః
కూపాంబురాశ్యోః పరమాణుమేర్వోః.

చ. అరయఁగఁ బ్రత్యగాత్మపరమాత్మలు దామయినప్పె వారి కె
ద్దఱకును నైక్యమబ్బు; మఱితా మలజీవప రేశులైన పర
స్పరము భటక్షితీశులటు, వాపియు సంద్రమటుల్, స్ఫులింగభా
స్కరులటు, నల్పునద్రియటు గాంచుట, వాసినిబొంద రైక్యముల్. 56

శ్లో. జన్మవృద్ధిపరిణ త్యపక్షయ
వ్యాధినాశనవిహీన మవ్యయమ్
విశ్వసృష్ట్యవనఘాతకారణం
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని.

మ. జననంబుం, బరివృద్ధి, పక్వతయు, సంక్షామంబు, రోగంబు, నా
శనము, న్నన్నగు భావవిక్రియల కేచందంబునన్ లక్ష్యమై
చన, కివ్విశ్వపస ష్టి పుష్టిలయబీజంబౌచుఁ దా నవ్యయ
త్వ నిరూఢిందగు బ్రహ్మమీవయని సంభావింపు మెల్లప్పుడున్. 57

శ్లో. లోకవాసనయాజంతోః శాస్త్రవాసనయాపిచ
దేహవాసనయా జ్ఞానం యథావ న్నైవజాయతే.

క. ఘన లోకవాసనాకల
ననుఁ, బటుతర శాస్త్రవాసనను మఱిఁ దనువా
సనను, బరివృతుఁడగుటను
గనలేఁడు నరుండు జ్ఞానగరిమము నెపుడున్. 58

శ్లో. అస్తభేద మనపాస్తలక్షణం
నిస్తరంగజలరాశి నిశ్చలం
నిత్యముక్త మవిభక్తమూర్తి యా
ద్బ్రహ్మతత్త్వమసి భావయాత్మని.

మ. అవిభిన్నంబయి, వీతలింగమయి, నిత్యంబై, నిరస్తాదియై,
యవిభక్తంబయి, ముక్తబంధమయి, నిత్యంబై, చలోర్మీ నికా
య విహీనంబగువార్ధిభంగి నచలంబై, యక్షరంబై, స్వయం
భవమై, వెల్గెడు బ్రహ్మమీవ యని సంభావింపు మెల్లప్పుడున్. 59

శ్లో. సంసారకారాగృహ మోక్షమిచ్ఛో
రయోమయం పాదనిబద్ధశృంఖలమ్
వదంతితద్ జ్ఞాః పటువాసనాత్రయం
యోఽస్మా ద్విముక్తః సముపైతి ముక్తిమ్.

చ. అనుచితమైన సంసరణమన్న భయంకరబందినుండి ము
క్తిని బడయంగఁగోరు నెడఁ దీవ్రతరంబగు వాసనాత్రయం
బనెడు నయోమయంపు నిగళావళి నొక్కటఁద్రెంపుటొప్పు;న
ట్లొనరుతురేనిఁ దోనఁ గననోపుదు రట్టివిముక్తి మానవుల్. 60

శ్లో. అనాత్మవాసనాజాలై స్తిరోభూతాత్మవాసనా
నిత్యాత్మనిష్ఠయా తేషాం నాశే భాతి స్వయంస్ఫుటమ్.

గీ. తన్ను దట్టమ్ముగాఁ గప్పియున్నయట్టి
ఘనతరబృహదనాత్మవాసనల నెల్ల
నవిరతబ్రహ్మనిష్ఠచే నవలఁద్రోయ
నాత్మవాసన వెలుఁగుఁ దనంతదానె. 61

శ్లో. యథాయథా ప్రత్యగవస్థితంమన
స్తథాతథా ముంచతి బాహ్యవాసనాః
నిశ్శేషమోక్షేసతి వాసనా నా
మాత్మానుభూతిః ప్రతిబంధశూన్యా.

చ. మనమలప్రత్యగాత్మమున మానక యెంతదృఢప్రశస్తదీ
క్షను బలుపొంది పాదుకొనఁగల్గునొ యంతద్రుతమ్ముగా, నశిం
చనుజుమి! బాహ్యవాసనలుచూడఁగ నవ్వి సమూలనాశమై
చనినఁ బరాత్మదర్శనము చయ్యనఁగల్గు నిరంతరాయమై. 62

శ్లో. మాతాపిత్రోర్మలోద్భూతం మలమాంసమయం వపుః
త్యక్త్వా చాండాలవద్దూరం బ్రహ్మీభూయ కృతీభవ.

గీ. తల్లిదండ్రుల మలము చేతనుజనించి
హేయ మలమాంసమయమైన కాయమెందొ
మాలనినిబోలె వదలి బ్రహ్మత్వమంది
ధన్యతంగంట నరునకుఁ దగినచొప్పు. 63

శ్లో. యత్సత్యభూతం నిజరూపమాద్యం
చిదద్వయానంద మరూపమక్రియమ్
తదేత్య మిథ్యావపు రుత్సృజేత
శ్చైలూషవ ద్వేషము పాత్త మాత్మనః.

చ. అరయఁగ సత్యభూతమును, నాద్యము, చిన్మయ, మవ్యయంబు, రూ
పరహిత, మక్రియంబునయి, భాసిలు శాశ్వతమైనరూపు, గు
ర్తెఱిఁగి, గ్రహించి, వీడఁదగు నిమ్మలినంపుటొడల్ బుధుండు; వా
విరిఁ దొలిఁ దాను గైకొనిన వేసము నల్లనటుండునుంబలెన్. 64

అవ: — అహంకారమే సర్వానర్థములకు మూలమని చెప్పుచున్నాఁడు.

శ్లో. సంత్యన్యే ప్రతిబంధాః పుంసః సంసారహేతవో దృష్టాః
తేషామేషాంమూలం ప్రథమవికారో భవత్యహంకారః.

గీ. ప్రబలసంసారమునకు గారణము నైన
యితరప్రతిబంధకములెన్నొ యొసఁగుఁగాని
యిన్నిఁటికి మూల మయ్యహంకృతియె గాన
దులుపవలె మానవుఁడు దానిఁదొట్టతొలుత. 65

శ్లో. అహంకారగ్రహాన్ముక్తః స్వరూపముపపద్యతే
చంద్రవద్విమలః పూర్ణః సదానందః స్వయంప్రభః.

గీ. స్ఫురదహంకార దుర్గ్రహోన్ముక్తుఁ డగుచు
నరుఁడు నిర్మలుండును సదానందమయుఁడు
పూర్ణుఁడు స్వయంప్రభుండునై పొలుపుగాంచు
రాహుసంరోధమెడలిన రాజువోలె. 66

శ్లో. యావద్వా యత్కించి ద్విషదోషస్ఫూర్తి రస్తిచే ద్దేహే
కథ మారోగ్యాయభవే త్తద్వ దహంతాపి యోగినోముక్త్యై.

గీ. ఒడలి నెందాఁక విషదోషముండు లేశ
మంతదాఁకను నారోగ్య మబ్బఁగలదె?
యట్లె యోగి నహంకృతి యలమెనేని
ముక్తిగననేరఁ; డది తుదముట్టుదాఁక. 67

శ్లో. సదైకరూపస్య చిదాత్మనోవిభో
రానందమూర్తే రనవద్యకీర్తేః
నైవాన్యథా క్వా ప్యవికారిణస్తే
వినాహమధ్యాస మముష్య సంసృతిః

చ. నిరతమునొక్కరూపె పావనిల్లఁ జిదాత్మతనొప్పి, విక్రియల్
దొరఁగి, సదాప్రమోదమున దోఁగుచు ఖ్యాతినిమించు నీకహం
కరణ తదాత్మతాస్ఫురణఁ గ్గానుగాని తలంప నన్యథా
పరఁగునె ఘోరసంసరణబంధపరంపర లెందునేనియుఙ్. 68

అవ:—అహంకారమే పగమశత్రువని సోదాహరణముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. తస్మా దహంకార మిమం స్వశత్రుం
భోక్తు ర్గళే కంటకవత్ప్రతీతమ్
విచ్ఛిద్య విజ్ఞాన మహాసినాస్ఫుటం
భుఙ్క్ష్వాత్మసామ్రాజ్యసుఖం యథేష్టమ్.

ఉ. వావిరిభోక్త కుత్తుకను బాటిలి నాటినకంటకంబు నా
నావిలపాటుగూర్చు; రిపుఁడైన యహంకృతినిట్టె నిస్తులం
బై వెలుగొందు జ్ఞానమునునట్టి మహాసినిఁ జెండి మోక్షల
క్ష్మీ విభవోరుసౌఖ్యమును జెందుటశ్రేయము మానవాళికిఙ్. 69

శ్లో. సమూలకృత్తోపి మహానహం పున
ర్వ్యుల్లేఖితః స్యాద్యది చేతసాక్షణం

సంజీవ్య విక్షేపశతం కరోతి
నభస్వతా ప్రావృషి వారిదోయథా.

ఉ. కుంకుడు వేరులుంచునిసి కుంగఁగఁగూల్చినఁగూడ, నమ్మహా
హంకృతి, చిత్తమొక్కత్రుటి యల్లనఁ దన్నటు రేపెనేని, తాఁ
గొంకక వెండియుంబొడమి, కూర్చువికారము లెన్నియేనియుఁ
బింకమెసంగు కారున, సమీరసమీరితవారిదంబటుల్. 70

శ్లో. నిగృహ్యశత్రో రహమోఽవకాశః
క్వచిన్న దేయో విషయానుచింతయా
సయేవ సంజీవనహేతు రస్య
ప్రక్షీణజంబీరతరోరివాంబు.

చ. పరుసపునిగ్రహమ్మొసఁగఁ బాపపు దుర్విషయానుచింతనం
దొరఁగి బుధుం డహంకృతిని, దుష్టరిపుంబలెఁ ద్రొక్కినొప్పగుఁ
సరవిని శుష్కమైన లికుజక్షితిజమ్మున కింతనీరు సే
కుఱునెడ నద్ది వెండిబ్రతుకుంగని యేపువహింపకుండునే? 71

శ్లో. దేహాత్మనా సంస్థితఏవ కామీ
విలక్షణః కామయితా కథంస్యాత్
అతోఽర్థసంధానపరత్వమేవ
భేదప్రసక్త్యా భవబంధహేతుః.

ఉ. ఈమెయినే, పరాత్మయని యెవ్వఁ డెడందలపోయు, వాఁడెపో
కామి, తదన్యుఁడెట్లు నతఁడు కాముకుఁడెట్లగుఁ; గాన భిన్నతా
శేముషిఁ దాను దుర్విషయసిద్ధికి నిత్యము దారితీయఁగా
క్షేమవిదూరసంసరణ సింధువునం బడు; మూఢుఁడెప్పుడుఁ. 72

శ్లో. వాసనావృద్ధితఃకార్యం కార్యవృద్ధ్యాచ వాసనా
వర్ధతేసర్వథాపుంసః సంసారో ననివర్తతే.

సీ. వాసనలు హెచ్చ విషయము ల్వడయువృద్ధి
విషయవృద్ధిని వాసనల్ వృద్ధిఁబొందు

నిట్టు లన్యోన్యమవి వృద్ధినెనయుచుండ
సంసరణమింక నేరీతి సమసిపోవు? 73

శ్లో. క్రియానాశేభవేచ్చింతా నాశోఽస్మాద్వాసనాక్షయః
వాసనాప్రక్షయేమోక్షః సజీవన్ముక్తి రిష్యతే.

ఆ. వె. క్రియలుడెగినఁ జింతక్షీణించు; నదిమాయ,
వాసనాక్షయంబు వరలు; దాన
నగును మోక్షసిద్ధి; యదియ జీవన్ముక్తి
యనుచుఁ బలుకుచుందు రార్యజనులు. 74

శ్లో. సద్వాసనాస్ఫూర్తివిజృంభణేసతి
హ్యసౌ విలీనా త్వహమాదివాసనా
అతిప్రకృష్టా ప్యరుణప్రభాయాం
విలీయతే సాధుయథా తమిస్రా.

మ. పరిశుద్ధంబగువాసనాభరము, దీవ్యద్భంగి జృంభింపఁగా,
దురహంకార దురంతవాసనలు క్రమందుంగాదె తోడ్తోడనే;
స్ఫురదుద్దామదివాకరాంచిత మహాజ్యోతిర్వితానంబునం
బొరి లీనంబగుఁగాదె యెంతటితమఃపుంజంబులున్ క్రేల్మిడిన్. 75

శ్లో. తమస్తమఃకార్య మనర్థజాలం
నదృశ్యతే సత్యుదితే దినేశే
తథాద్వయానందరసానుభూతౌ
నైవాస్తిబంధో నచ దుఃఖగంధః.

ఉ. బంధురపాటలప్రభలఁ బాయక, రోదసినింపుచున్, జగ
ద్బాంధవుఁ డుద్భవింపఁ బరితఃపరిదృష్ట నిజానుబంధ యు
క్తాంధతమస్సు డిందుగతి, నద్వయతైకరసానుభూతి సం
బంధము పేర్మిఁ దోనఁదెగు; బంధములున్, మఱి దుఃఖగంధముల్.

శ్లో. విషయాభిముఖం దృష్ట్వా విద్వాంసమపి విస్మృతిః
విక్షేపయతి ధీదోషైః యోషా జారమివ ప్రియమ్.

చ. ఘనవిషయాభిలాషుఁడయి క్రాలెడు నేని, యదెంతధీరు నై
నను బెనుమాయలాగి, మతినాశమొసంగ, నగాధవిక్రియా
వనధిని మాటిమాటికినిఁ బాయకముంచుచుఁ దేల్చుచుండు; జ
వ్వనియగు కాంత రక్తుఁడయి వచ్చిన జారవరేణ్యు నింబలెన్. 77

శ్లో. యథాప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి
ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖమ్.

గీ. లాగి తొలఁగించినను, శైవలవ్రజంబు
చనక మఱివచ్చి క్రమ్మెడు చంద మొప్ప
వలగొను మాయ, యెంతటి ప్రాజ్ఞునైన
బ్రహ్మవిద్యావిదూరుఁడై పరఁగు నేని. 78

శ్లో. లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమీషద్
బహిర్ముఖం సన్నిపతే త్తతస్తతః
ప్రమాదతః ప్రచ్యుత కేలికందుకః
సోపానపంక్తౌ పతితో యథా తథా.

ఉ. చిత్తము లక్ష్యసంచ్యుతినిఁ జెంది, బహిర్ముఖమయ్యె నేని, రే
కెత్తెడు చంచలత్వమున, నెన్నొవికారములందియంది, పె
న్నత్తరకగ్గమై తుదకుఁ గాంచు నధోగతి; చేతినుండి యు
వ్వెత్తుగ జాఱి మెట్లఁబడి యెంతయు దొర్లెడు బంతికైవడిన్. 79

శ్లో. విషయేష్వావిశచ్చేతః సంకల్పయతి తద్గుణాన్
సమ్యక్సంకల్పనాత్కామః కామాత్పుంసః ప్రవర్తనమ్.

గీ. మనము విషయమ్ములనుజొచ్చి యనవరతము
మగ్నమై యుండుఁ దద్గుణస్మరణమందె

స్మరణమునఁ గామమొనఁగుఁ; గామమునఁ జేసి
నరుఁడు భోగానుభూతి తత్పరత మెలఁగు. 80

శ్లో. బాహ్యేనిరుద్ధే మనసః ప్రసన్నతా
మనః ప్రసాదే పరమాత్మదర్శనమ్
తస్మిన్ సుదృష్టే భవబంధనాశో
బహిర్నిరోధః పదవీవిముక్తేః.

చ. వెలుపలియింద్రియమ్ములను, శీఘ్ర నిరోధము సేయఁ జిత్తని
ర్మలత ఘటిల్లు; దానఁ బరమంబగు బ్రహ్మపదార్థదర్శనం
బలవడు; దాన, నిర్గళితమై, భవబంధము డిందుఁ; గాన, నె
వ్వలనను ముక్తికిందగినబాట, బహిర్వినిరోధమే సుమీ! 81

శ్లో. తతో వికారాః ప్రకృతే రహంముఖా
దేహావసానా విషయాశ్చ సర్వే
క్షణేఽన్యథా భావినఏష ఆత్మా
నోదేతి నాప్యేతి కదాపి నాన్యథా.

చ. ప్రకృతిభవమ్ములై భ్రమను బాటిలఁజేసెడు నయ్యహంక్రియా
దిక విషయమ్ములన్నియును దేహముతో లయమందుఁగాని, యీ
ప్రకృతి కతీతమైనపరవస్తువుమాత్ర మొకప్పుడేనిఁ బు
ట్టుకఁగొన; దస్తమింపదు; పటుప్రభలం దిరమై వెలింగెడిన్. 82

శ్లో. సతిసక్తోనరోయాతి సద్భావం హ్యేకనిష్ఠయా
కీటకో భ్రమరంధ్యాయ న్భ్రమరత్వాయ కల్పతే.

గీ. నిరతముఁ దదేకనిష్ఠతో నరుఁడు రక్తిఁ
బరునిధ్యానించి బ్రహ్మమై పరఁగుఁ దాను
భ్రమరమును సర్వదా స్మరింపంగఁగనుట
కీటకముదాను భ్రమరమై కెరలుఁగాదె. 83

శ్లో. యథాసువర్ణం పుటపాకశోధితం
త్యక్త్వామలం స్వాత్మగుణం సమృచ్ఛతి
తథామనః సత్త్వరజస్తమోమలం
ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్.

చ. పుటమునఁ దేఱి సర్వమలముల్ లయముంబొనరించి, శుద్ధమై,
స్ఫుటమయి, స్వీయసద్గుణముఁబొంది వెలింగెడు స్వర్ణముంబలెన్
పటుతరమైన జ్ఞానవిభవమ్మున, సత్త్వరజస్తమంబులం
దటుకునఁ బాఱఁదోలి, నిజతత్త్వమునొంది, మనమ్ముభాసిలున్. 84

శ్లో. యోగస్య ప్రథమంద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః
నిరాశాచ నిరీహాచ నిత్య మేకాంతశీలతా.

గీ. సతతమొంటిగనుంట, చేఁజాచకుంట,
విషయవాంఛల నొక్కంట విడువఁగంట,
మౌనముంగొంట, తృష్ణపై మఱపుగంట,
మొదలిసోపానములు, యోగమునకు నివ్వి. 85

శ్లో. వైరాగ్యబోధౌ పురుషస్యపక్షివత్
పక్షౌవిజానీహి విచక్షణత్వమ్
విముక్తిసౌధాగ్రతలాధిరోహణం
తాభ్యాంవినా నాన్యతరేణ సిద్ధ్యతి.

చ. పొలుచుఁజామీ! విరాగతయు, బోధమునాఁజను రెండుఱెక్కల
ప్పొలుఁగునకట్లు; గాటపుముముక్షనెసంగు వివేకికెందునుం
దలమగునెట్లు ముక్తిమయధామ శిఖాద్యధిరోహణంబు, త
ద్బలపరిపాటిబాసటనుదక్క మఱొక్కటఁ బండితాగ్రిణీ! 86

శ్లో. తరంగఫేనభ్రమబుద్బుదాది
సర్వం స్వరూపేణ జలంయథా తథా

చిదేవ దేహాద్యహమంత మేత
త్సర్వం చిదేవైకరసం విశుద్ధమ్.

గీ. అలలు, బుడగలు, సుళ్ళు, నురువులును, దొట్టి
నిఖిలమివి, వారివికృతులు, నిక్కమెన్నఁ
దనవుదొట్టి యహంతదాఁకను గలట్టి
సకల, మేకవిశుద్ధచిద్వికృతు లివ్వి. 87

శ్లో. అత్యంత కాముకస్యాపి వృత్తిః కుంఠతి మాతరి
తథైవ బ్రహ్మణి జ్ఞాతే పూర్ణానందే మనీషిణః.

గీ. ఎంతకామమ్ముగల జారుఁడేని తనదు
తల్లిదెస నెప్డు వేఁకొక్కతలఁపు గనునె
యట్లె బుధుఁడు పూర్ణానందుఁడగు పరేశుఁ
గనినఁ బెరతలంపులుడిగి తనియుఁగాదె! 88

శ్లో. ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః
సమ్యగ్జ్ఞానహుతాశనేన విలయః ప్రాక్సంచితాగామినాం
బ్రహ్మాత్మైక్యమవేక్ష్య తన్మయతయా యే సర్వదా సంస్థితా
స్తేషాం తత్త్రితయం నహి క్వచిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్.

మ. అలప్రారబ్ధ మలంఘ్య మోతలకు, క్షయ్యంబద్ది, తద్భుక్తిచేఁ
బ్రశయంబుంగను జ్ఞానవహ్నికలనం బ్రాక్సంచితాగాము, లి
మ్ములబ్రహ్మాత్మసమైక్యతం బరములై పొల్పారు; యోగీంద్రభ
ర్తల కమ్మూడును లేవు; నిర్గుణపరబ్రహ్మమ్ము లవ్వారనఁ. 89

శ్లో. ఉపాధిరాయాతి సఏవగచ్ఛతి
సఏవకర్మాణికరోతి భుఙ్క్తే
సఏవజీవన్మ్రియతే సదాహం
కులాద్రివన్నిశ్చలఏవ సంస్థితః.

చ. పరఁగు, నుపాధిమాటికిని, వచ్చును, బోవును, గర్మకాండము
న్నెఱపును, దత్ఫలానుభవనిష్ఠమెలంగును బ్రాణయుక్తమై
పరఁగును, మృత్యువుంగనును, బాయక నేను, మహాకులావనీ
ధరములపోల్కిఁ నిశ్చలత దాఁగొనన ట్టులయుందు నెప్పుడున్. 90

శ్లో. జలేవాపి స్థలేవాపి లుఠత్వేష జడాత్మకః
నాహంవిలిప్యే తద్ధర్మై ర్ఘటధర్మై ర్నభోయథా.

గీ. పొరలెడుంగాత మిచ్చచొప్పునను దాను
మెట్టనో, నీటనో, యోటికట్టె యిద్ది
యంట నలదానిధర్మంబు లాత్మనెపుడుఁ
దలఁప ఘటధర్మములు మహాబిలమునట్లు. 91

శ్లో. క్షుధాం దేహవ్యథాంత్యక్త్వా బాలఃక్రీడతి వస్తుని
తథైవవిద్వాన్ రమ తే నిర్మమో నిరహంసుఖీ.

గీ. క్షుధను, దేహవ్యథను, దన్నుఁగూడ మఱచి
♦చోఁఱ, క్రీడించు, నాటవస్తువునఁదవిలి
మమతను, నహంకృతిని, నల్లె మఱవఁగాంచి
సుకృతి, రమియించు నాత్మవస్తువునఁ దవిలి. 92

అవ:—బ్రహ్మవేత్తల శాస్త్రవిహితవ్యవహారమును జెప్పుచున్నాఁడు.

శ్లో. చింతాశూన్య మదైన్యభైక్ష్యమశనం పానం సరిద్వారిషు
స్వాతంత్ర్యేణనిరంకుశాస్థితి రభీర్నిద్రా శ్మశానే వనే
వస్త్రం క్షాళనశోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సంచారో నిగమాంతవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి.

సీ. చీకుఁజింతయు లేక సిద్ధింపఁగాఁగన్న
యమల భైక్ష్యోదనం బారగింపు

♦చోఁఱ=బాలకుఁడు.

చల్లనిసెలయేళ్ళజలము పానీయమ్ము
వల్లకాటితలమ్ము వాసభూమి
తడుపును నెండవేతయును నక్కఱలేని
యాశాష్టకము మేలి యంబరమ్ము
అనుపమశ్రీయనంజను స్వతంత్రిహాళ్ళి
పెంపెక్కు నభయంబు విడనిత్రోడు

గీ. ఉపనిషద్వీథులు విహార యోగ్యతలులు
సచ్చిదానందరూపమై జానుమీఱు
నల పరబ్రహ్మమే. వినోదాస్పదంబు
బ్రహ్మనిష్ఠాగరిష్ఠులౌ పావనులకు. 93

శ్లో. దిగంబరోవాపిచ సాంబరోవా
త్వగంబరోవాపి చిదంబరస్థః
ఉన్మత్తవద్వాపిచ బాలవద్వా
పిశాచవద్వాపి చరత్యవన్యామ్.

చ. అరయఁగ బ్రహ్మవేత్తయగునట్టిబుధుండు దిగంబరుండో సాం
బరుఁడో, త్వగంబరుండో, మహిమంబ్రకటించుఁ జిదంబరస్థుడై
చిఱుతనియట్లో, లేక మతిచెడ్డమనుష్యునియట్లో, భీతి చే
కుఱుచు పిశాచమట్లో, భువిఁగ్రుమ్మరుచుండు; నిరంతరాయతన్. 94

శ్లో. ప్రారబ్ధకర్మపరికల్పితవాసనాభి
సంసారివచ్చరతి భుక్తిషు ముక్తదేహః
సిద్ధఃస్వయంవసతి సాక్షివ దత్రితూష్ణీం
చక్రస్యమూలమివ కల్పవికల్పశూన్యః.

చ. కరము విముక్తదేహుఁడయికాళ్ళెడు యోగి పురాకృతక్రియా
స్ఫురిత ఫలానుభుక్తులవి చొప్పడినప్డు, కుటుంబిపోలికం

దొరకొనిసంచరించు నరతుండయి; కల్పవికల్పనంబులం
బొరయక కంటిపే రిరుసుపోలిక నూరక సాక్షిమాత్రుఁడై 95

శ్లో. శైలూషో వేషసద్భావా భావయోశ్చ యథాపుమాన్
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః సదా బ్రహ్మైవ నాపరః.

చ. తలఁప నటుండు వేషమునుదాలిచినప్డును దాని నోలిమైఁ
దలఁగి చరించుపట్టునను దా నల తొంటినరుండె యైనటుల్
విలసితసద్వివేకుఁడయి వెల్గెడుయోగి దశాంతరమ్ములం
దలకొని పొందుచుండినను దాను సదా పరమాత్మయేకదా ! 96

శ్లో. దేహస్యమోక్షో నోమోక్షో నదండస్య కమండలోః
అవిద్యాహృదయగ్రంధిమోక్షో మోక్షో యతస్తతః.

గీ. కాయమోక్షంబు మోక్షంబుగాదు; కుండి
కదియు దండమ్ముదియును మోక్షంబుగాదు;
భూరి మాయామనోగ్రంథి మోక్షమొకఁడె
మోక్షమగుఁ;గాన దానికై దీక్షగొనుము. 97

శ్లో. పత్రస్యపుష్పస్య ఫలస్య నాశవ
ద్దేహేంద్రియప్రాణధియాం వినాశః
నైవాత్మనస్స్వస్య సదాత్మకస్యా
నందాకృతే ర్వృక్షవదాస్త ఏషః.

చ. దళములు, పుష్పముల్, ఫలవితానములు, న్నశియింప, నేకొకఁటిం
తలును, ఘటిల్లకుండఁగద ధారుణిజమ్మున; కట్లె, యింద్రియం
బులు నుసురుర్, మనంబుఁ, దనువున్, బడిపోవ, లోపముల్
గలుగునె ? శాశ్వతుండగుచుఁ గ్రాలు పరాత్మకునెప్పుడేనియున్. 98

శ్లో. క్షీరంక్షీరే యథాక్షిప్తం తైలంతైలే జలంజలే
సంయుక్తమేకతాంయాతి తథాత్మన్యాత్మవి న్మునిః.

గీ. పాలు పాలను, దైలంబు తైలమునను
నంబు వంబులఁగలిసి యైక్యంబుఁజెందు
నట్టులే యాత్మవిదుఁడైనయట్టి మునియు
నాత్మలోఁజేరి తానైక్యమందుఁగాదె? 99

శ్లో. స్థూలస్యసంభవజరామరణాని ధర్మాః
స్థౌల్యాదయో బహువిధాః శిశుతాద్యవస్థాః
వర్ణాశ్రమాదినియమా బహుధామయాః స్యుః
పూజావమాన బహుమానముఖా విశేషాః.

చ. జననము వార్ధకమ్ము మృతి స్థౌల్యము కార్శ్యము శైశవమ్ము యౌ
వనమును వర్ణ మాశ్రమము వ్యాధి యరోగము దుఃఖము న్సుఖ
మ్మును వినుతిం దిరస్కృతినిఁబుట్టుచునుండు వికారవైఖరుల్
సుశిక్షితబుద్ధినారయఁగ స్థూలశరీరపులక్షణావళుల్. 100

## గ్రంథాంతము

శా. నాగాంబావరగర్భశుక్తివిలస న్నవ్యైకముక్తామణీ!
వాగీశప్రతిమాన భాసురకళావైదగ్ధ్య సంభావితా!
త్యాగప్రాభవవైభవాంచితసుధీ! ధర్మావధీ! యంబుధి
శ్రీగాంభీర్యధురంధరా! నుతగుణా! శ్రీసత్యనారాయణా! 101

కం. శరదిందుచంద్రికాభా
సురదిగ్విశ్రాంతకీర్తి! సుందరమూర్తీ!
స్ఫురదౌదార్యగుణామర
ధరణీజా! మన్నవంశతటినీశాబ్జా! 102

మాలిని. హిమనగసమధైర్యా! వృత్తసంప్రీణితార్యా!
అమరవినుతకీర్తీ! యబ్జబాణాభమూర్తీ!
శమదమనయశాలీ! సత్యసంధత్వశీలీ!
శమితవిమతతంద్రా! సత్యనారాయణేంద్రా! 103

గద్య.

ఇది శ్రీమత్కౌండిన్య సగోత్ర శిష్టావంశకలశవారాశి రాకాకైరవమిత్ర పవిత్రచరిత్ర నరసమాంబా సూర్యనారాయణశాస్త్రి పుత్ర కవిభూషణ, కవిశేఖర బిరుదాంకిత వేంకటసుబ్బయ నామధేయ ప్రణీత సుబ్బకవీయము సంపూర్ణము.



మెజిస్టిక్ ప్రెస్, రాజమండ్రి:—1952.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 15 | త్వలము | త్పలము |
| 25 | 6 | కొకప్పుడు | రొకప్పుడు |
| 25 | 17 | దూరలు | చూరులు |
| 25 | 26 | మ నిక్యం | మాణిక్యం |
| 27 | 13 | అఱిగిన వెన్న | అఱిగిన వెన్క |
| 28 | 21 | గోర్కొని | గోల్కొని |
| 32 | 13 | దుస్సాన్థ్య | దుస్సాన్థ |
| 32 | 20 | హాస్తి | ఘ్నస్తి |
| 36 | 20 | గూరా | గ్రూరా |
| 37 | 2 | వచియుంప | వచింప |
| 40 | 10 | గెన్న | లెన్న |
| 41 | 19 | తరు కావ | తరు కాష్ఠ |
| 41 | 21 | పాలము | పాలయు |
| 47 | 8 | కవులౌదురు | కప్రులౌదురు |
| 55 | 23 | స్వర్గ | స్వర్ణ |
| 57 | 10 | నట్టి | వట్టి |
| 64 | 19 | దౌర్భ్యాభి | ద్వౌర్భ్యాభి |
| 66 | 4 | తునక | తునుక |
| 70 | 1 | దమ్మిపయు | దమ్మిపయి |
| 70 | 2 | వీడు | వీడ |
| 72 | 28 | లెమ్ము | లెమ్మ |
| 76 | 8 | భవద్గోక్షి | భవద్గోష్ఠి |
| 77 | 18 | మెక్కల | మొక్కల |
| 79 | 17 | కొడినాఱదు | కొడివాఱదు |
| 98 | 19 | తను వెప రాత్మ | తను వె పరాత్మ |

| | | | |
|---|---|---|---|
| 104 | 11 | చ్ఛిత్ప్రబిం | చ్ఛిత్ప్రతిబిం |
| 106 | 6 | స్ఫుప్రభః | స్ఫుటప్రభః |
| 106 | 16 | భ్రాత్యా | భ్రాంత్యా |
| 107 | 15 | బ్రహ్మంబె | బ్రహ్మమే |
| 107 | 23 | బ్రథా | ప్రథా |
| 108 | 15 | సష్టి | సృష్టి |
| 109 | 25 | చనుజుమి | చునుజుమి |
| 118 | 9 | నల | వల |
| 118 | 21 | భైక్ష్యోదనం | బైక్ష్యాదనం |
| 119 | 5 | స్వతంత్రి | స్వతంత్రత |
| 119 | 19 | కఃల్పిత | కల్పిత |

